# ఆత్మ యజ్ఞము

"బాహ్య కర్మ లెల్ల బాటించి తా కర్మ
సోమయాజి యయ్యె సుమ్ము; దాన
నాత్మయజ్ఞ సంభృతానందుడగు బ్రహ్మ
సోమయాజి కున్న సుఖము కలదె!"


ర చ న

'బ్రహ్మీభూత' భాగవతుల రామయ్యగారు

కూ చి పూ డి

సం పా ద కు డు

'సాహిత్యరత్నమ్', 'కావ్యభూషణ', 'కవితాసుదాకర', 'పండితరత్న'

విద్వాన్ చింతలపాటి లక్ష్మినరసింహశాస్త్రి

రిటైర్డ్ గ్రేడ్ - I తెలుగు పండితుడు

ఘంటశాల — మొవ్వ తాలూకా—కృష్ణా జిల్లా



శ్రీమతి ఝాన్సీ

# అంకితము

అమ్మా, ఝాన్సీ! నీవు, నా మిత్రుడు సహృదయుడు గ్రామ సర్పంచి అయిన శ్రీ వేమూరి నాంచారయ్యగారి ద్వితీయ కుమార్తెవు, నాకు శిష్యురాలవు. అన్నివిషయాలలోను పెద్దగా వ్యవహరించావు. పిలుపులోను, తలపులోను, పలుకులోను నీ పెద్దరికం తొణికిసలాడింది. అదే అందరినీ ఆకట్టుకుంది. అల్పాయుష్మంతురాలవైనా నీ కీర్తి నలుగడల వ్యాపించింది. అందుకే ఈ "ఆత్మయజ్ఞం" నీ ఆత్మసంతృప్తికై సమర్పిస్తున్నాను.

నీ గురువు

ఘంటసాల "పండితరత్న"

4-10-1986 చింతలపాటి లక్ష్మీనరసింహశాస్త్రి

# స్మృత్యంజలి



ఆనన మా సరస్వతికి ఆలయ మౌనట దృష్టి ద్రష్ట యా
మౌనిని గుర్తు జేయునట మాట మనోహర మంత్రమంట ప్రా
చీనత వెల్గు నవ్వుడట, చింతలపాటికుల ప్రదీపు ల
క్ష్మీ నరసింహశాస్త్రి గురు స్నిగ్ధమనస్కు నమస్కరించెదన్.

'ఆంధ్రరత్న', 'నాట్యకళాప్రపూర్ణ'
డాక్టర్ నటరాజ రామకృష్ణ
అశోక్‌నగర్, హైదరాబాదు - 20

## కళాంజలి

ఒక మహా పురుషుడు రచించిన ఆధ్యాత్మిక ప్రబోధ నృత్య ప్రబంధం, దృశ్యకావ్యం ఈ గొల్లకలాపం, ఈ గోపికా విప్ర సంవాదం.

యోగుల నోటివెంట వెలువడే ప్రతి చిన్న పలుకూ ఒక సూక్తి. ఆ సూక్తి ముచ్చటైన మూడు మాటల్లో ఉండవచ్చును. ఆ సూక్తిని చదివి, మననం చేసికొంటే ఆత్మానుభూతిని పొందవచ్చును. అయితే ఆ సూక్తిలోని పద్యాలను దానివలన పొందే అనుభూతులను ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగా లోకానికి వెల్లడిస్తూ ఉంటారు. భగవద్గీతకు ఎంతోమంది, ఎన్నో వ్యాఖ్యానాలు చెప్పినట్లు.

శ్రీ రామయ్యగారి గొల్లకలాపం గూడా ఇలాంటిదే. దీనిలోని పద్యాలు, పాటలు, దరువులు, గద్యాలు వేదాంతపరమైనవి. ఈయన భాగవతోత్తముడు, పరమభాగవతోత్తముడు అని అంటే ఆయనకు ఒప్పుతుంది. జ్ఞాన ప్రబోధకమైన, ఆధ్యాత్మికసంబంధమైన, ఆత్మానందకరమైన అనేక విషయాలను అందరకూ అర్థమయ్యేటట్లు ఆడుతూ, పాడుతూ చెప్పాలన్నదే వారి సంకల్పం. అందుకే ఈ ప్రబంధాన్ని ఆయన రచించారు.

దృశ్య ప్రబంధాలు, శ్రవ్యప్రబంధాలు అని ఇవి రెండు విధాలైనవి. రచనలో ఈ రెండూ రెండు విధాలుగా ఉంటాయి. శ్రవ్యప్రబంధంలో వర్ణనలు, అలంకారాలు ఎక్కువగా ఉంటాయి. వీటిని చదువుతూ, ఆ దృశ్యాలను ఊహించుకొంటూ చదువరులు ఆనందిస్తారు. కవి దీనిలో తన పాండితీ ప్రతిభను, భాషాప్రకర్షను, కవితా చమత్కృతిని ప్రదర్శిస్తాడు.

దృశ్య ప్రబంధంలోని భాష సరళంగా సులభంగా ఉంటుంది. సంగీతానికి, లయకు అనువుగా ఉంటుంది. అందువల్ల నర్తకులు తమ అంగిక, సాత్వికాభినయాలతో నృత్త, నృత్యాలతో ఆ ప్రబంధం ప్రేక్షకుల కళ్లకు కట్టినట్టు ప్రదర్శించగలుగుతారు. నృత్యాభినయాలను ఎరిగినవారే ఇటువంటి దృశ్యప్రబంధాలను రచించగలుగుతారు. అట్టి వారిలో గట్టివారు మన రామయ్యగారు.

భరతకళానిధి బ్రహ్మశ్రీ వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రిగారి వద్ద నేను కూచిపూడి నాట్యం అభ్యసిస్తున్నప్పుడు ఈ గొల్ల కలాపాన్ని కూడా నేర్చుకొనే అవకాశం కలిగింది. ఆ తర్వాత పిఠాపురంలో శ్రీమతి పెండేల సత్యభామగారివద్ద "సపజనార్దన పారిజాతాన్ని" అభ్యసిస్తున్నప్పుడు ఇటువంటి ప్రబంధాన్నే నేర్చుకొన్నాను. ఈ రెండు ప్రబంధాల్లోను కొలది తేడాలు ఉన్నాయి.

శ్రీ భాగవతుల విస్సయ్యగారితో నాకు లేఖల ద్వారా పరిచయం ఏర్పడింది. ఈ పరిచయం స్నేహంగా మారి మా మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు చాలాకాలం కొనసాగినాయి. వీరు గొల్లకలాప విద్యలో నిష్ణాతులు. గొల్లకలాపంలోని విశిష్టతను వీరే లోకానికి ఎరుకపరచారు.

మారంపల్లి సోదరీమణులు శ్రీమతి చిత్తజల్లు వైదేహి, శ్రీమతి ఇందువదనల్లూ, ముమ్మడివరానికి చెందిన భరతకళా ప్రపూర్ణ శ్రీమతి అన్నాబత్తుల బులి వేంకటరత్నంగారు ప్రదర్శించిన గొల్లకలాపాలను ఎన్నోసార్లు చూసే అవకాశం కలిగింది.

కళా సోదరుడు భాగవతుల రామకోటయ్యగారు నాకు చిరకాల పరిచితులు, స్నేహితులు. వారితో ఈ గొల్లకలాప విశిష్టతను గూర్చి తరచుగా చర్చిస్తూ ఉండేవాణ్ణి.

గొల్లకలాపాన్ని కళాకారులు విజయవంతంగా ప్రదర్శించాలంటే వారు సంస్కృతంలో పంచకావ్యాలను చదివి యుండాలి. సంస్కృత శ్లోకాలకు సంస్కృతంలోనే వ్యాఖ్యానం చెప్పగల దిట్టలై యుండాలి. సంగీతం నేర్చుకొని, చక్కగా పాడగలగాలి. భరతాభినయాలను అభ్యసించి ఉండాలి. వీటికి తోడు వాగ్ధాటి కలిగియుండాలి. ఇంతటి ప్రజ్ఞావంతులే పండిత, పామరరంజకంగా దీనిని ప్రదర్శించగలరు. అందుకే దీనిని సమర్థవంతంగా ప్రదర్శించగలవారు మనదేశంలో బహుకొద్దిమంది మాత్రమే ఉన్నారు.

హైందవ సంస్కృతీ వికాసానికి ఆలంబనమైన, ఆత్మజ్ఞాన ప్రబోధకమైన ఇట్టి ఉత్కృష్ట గ్రంథాన్ని పరిశోధనా పాటవంతో పరిష్కరించి ప్రచురించిన కీ. శే. పండితరత్న చింతలపాటి లక్ష్మీనరసింహశాస్త్రిగారు బహుధా ప్రశంసనీయులు, ప్రాతర్వంద నీయులు. వారికి ఇవే మా కళాంజలులు.

హైదరాబాద్, 1-6-1987 — నటరాజ రామకృష్ణ

పి. వి. ఆర్. కె. ప్రసాద్, I. A. S.,
కమీషనర్, ఎక్సైజ్ శాఖ,
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము, హైదరాబాద్

## కళా సృష్టి - ఆధ్యాత్మిక దృష్టి

ఆంధ్రులు అనాదిగా నాట్య నాటక కళారంగాలలో సిద్ధహస్తులని చెప్ప టానికి అనేక ఆధారాలున్నాయి.

క్రీస్తుశకం రెండవ శతాబ్దిలో వర్ధిల్లిన ఆచార్య నాగార్జునుడు నైకశాస్త్ర పారంగతుడు, సకల కళాకోవిదుడు. అతని కాలంలో నిర్మించిన ఆరుబయట రంగస్థలం నాగార్జునకొండవద్ద చారిత్రకావశేషాలలో బయటపడింది.

అంతేకాదు. ఆ కాలంలోనూ, ఆ తర్వాతి కాలంలోనూ వెలసిన శిల్ప సంపద ఆనాటి నాట్య నాటకాల వైభవాన్ని చాటే జయపతాకగా నిలిచి ఉంది.

ఇక సాహిత్య సాక్ష్యాలు పరిశీలిస్తే—తెలుగువారి తొలి కవి నన్నయ ఆంధ్రమహాభారతంలో

"ఉదాత్త రసాన్విత కావ్య నాటక ప్రకరము సూచితిన్" అనీ,

"నాటకప్రయోగంబునుంబోలె ఘనరసపాత్ర శోభితరంగ రమ్యంబైన దాని" అని నాటకాల గురించి ప్రస్తావించాడు.

తిక్కన సోమయాజికూడా ముఖ్యంగా విరాటపర్వంలో నాట్యవిశేషా లనేకం వర్ణించాడు.

పాల్కురికి సోమనాథుడు సరేసరి!

"అద్భుతమ్ముగ బొమ్మలాడించువారి" నీ, "నాదట గంధర్వ యక్ష విద్యాధరాదులై పాత్రల నలరించువారి" నీ,

"అనుకూల వివిధ వాద్యాకీర్ణరవము
నాద్భుట యిచ్చి యొయ్యన జవనికల

గర్భంబు వెడలి" — వచ్చే పాత్రధారుల్నీ, ఆనాటి జనపదాల్లో, ఉత్సవాల్లో, రాజాస్థానాల్లో ప్రయోగించే నాట్య నాటకాలను తేనెలూరే జాను తెనుగులో తేటతెల్లంగా వర్ణించాడు.

ఎఱ్ఱన నృసింహపురాణంలో చేసిన అద్భుతవర్ణన ఆనాటి రంగస్థలాన్ని మన కళ్లముం దుంచుతున్నది.

సురుచిర తారకా కుసుమశోభి నభోంగణభూమి కాలమక
గురువపు సూత్రధారు జతనంబున దిక్పతికోటి ముంగటన్
సరసముగా నటింపగ నిశాసతి కెత్తిన క్రొత్తతోపు టెం
దెరయన నొప్పె సాంధ్య నవదీధితి పశ్చిమ దిక్తటంబునన్.

శ్రీనాథ కవిసార్వభౌముడు క్రీడాభిరామంలో — "మహాలక్ష్మి కైటభారి వలపుబాడుచు" వచ్చే జక్కుల పురంధ్రి చక్కదనాన్ని కమ్మని పదాలతో బొమ్మకట్టించినాడు.

ఇలా ఇంకా అనేక గ్రంథాలలో మన ప్రాచీనుల నాట్య నాటకాల గురించిన ప్రస్తావన కనిపిస్తుంది.

ఆనాటి ఆ కళారూపాన్ని నాటకమనండి, రూపకమనండి, వీధినాటక మనండి, భాగవతమనండి, హరికథ అనండి, యక్షగాన మనండి, ఉదాహరణ మనండి, ఏ పేరుతో పిలిచినా అది తెలుగుజాతి చరిత్ర వెలుగు చూసేనాటికే జనపదాల్లోనూ, రాజాస్థానాల్లోనూ కూడా పండితపామరుల్ని ఆనంద పరుస్తున్నది. కేవలం వినోదప్రధానమే కాదు, మతప్రచార సాధనంగా కూడా ప్రాముఖ్యం వహించింది.

ఏ జాతి మహోన్నత చరిత్రనైనా చాటిచెప్పేవి ఆ జాతి సంస్కృతీ, సంప్రదాయాలు. అట్టి సంస్కృతీ సంప్రదాయా సౌరభాలు వెదజల్లేవి ఆ జాతి సృష్టించుకున్న సాహిత్య, కళారూపాలు మన ప్రాచీనాంధ్ర సంస్కృతీ సంప్రదాయాలకు ప్రతీకగా, కళావైభవానికి పట్టిన కరదీపికగా నిలిచింది కూచిపూడి నాట్య సంప్రదాయం.

చతుర్విధ కళా సంపూర్ణ సమన్వయ స్వరూపం నాట్యకళ.

'ఉత్తమం భరతం శాస్త్రం జ్ఞాన వైరాగ్య సాధనమ్' అన్న వాక్యం భారతీయ కళల పరమార్థాన్ని చాటుతున్నది.

పరమ శివుడు నటరాజు. ఆయన చేతిలోని డమరుకం సృష్టికి ప్రతీక. అభయ ముద్ర స్థితికి చిహ్నం. చేతిలోని జ్వాల లయానికి సంకేతం. ఎత్తిన పాదం మోక్షానికి సూచన. వంచిన చేయి అనుగ్రహానికి గురుతు. ఇలాంటి

నటరాజ స్వరూపం మన కళా సృష్టికి ఆధ్యాత్మిక దృష్టి ప్రసాదిస్తున్నది. అందుకే-

> నృత్యం గీతాభినయైః రాజానాం దైవతం గురుమ్
> తోషయే భరతం శాస్త్రం భక్తి ముక్తి ఫలప్రదమ్ ।

అని కీర్తించారు.

అందుకు ఉత్తమోత్తమోదాహరణ కూచిపూడి సంప్రదాయంలో వెలసిన ఈ 'ఆత్మ యజ్ఞము' అనె గొల్ల కలాపము.

ఇందులో లౌకిక ఆధ్యాత్మిక విషయాలు సయుక్తంగా చర్చించ బడ్డాయి. ఇది గొల్లభామ, బ్రాహ్మణుల మధ్య జరిగిన సంభాషణ. పిండోత్పత్తి యజ్ఞ పట్టు అనే విషయాలు యిందులో కన్పిస్తాయి. శిశు జననాన్ని గూర్చిన శాస్త్రీయ విషయం వివరిస్తుంది. 'పిండోత్పత్తి' యజ్ఞపట్టు యజ్ఞ కర్మ నిర్వహించే విధానాన్ని వివరించి. అందులోని మంచి చెడ్డల్ని నిశితంగా చర్చిస్తుంది.

భగవద్గీతలోని ఆత్మ సంయమ, మోక్ష సన్న్యాస యోగాలలోని గంభీరమైన క్లిష్టతరమైన అంశాలు పండిత పామరు లందరికీ అర్థమయ్యే రీతిలో "ఆత్మ యజ్ఞం" ప్రతిపాదించ బడింది.

> సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।
> అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః॥

అన్న పరమార్థమే ఈ నృత్య రూపక ఫలితార్థం.

ఒక్క మాటలో చెప్పాలంటే ఇది ఒక అపూర్వ ప్రయోగం. అతి క్లిష్టమైన మహోత్కృష్టమైన వైదిక, శాస్త్రీయ, ఆధ్యాత్మిక విషయాలు ప్రధాన వస్తువుగా స్వీకరించి, నృత్య నాటికగా ప్రయోగించటం అసాధారణం అనితర సాధ్యం. ప్రపంచ సాహిత్యంలోగానీ, రంగస్థలం మీదగానీ ఇట్టి మహత్తరమైన నృత్య రూపకం 'న భూతో న భవిష్యతి' అంటే అతిశయోక్తి కాదు.

అయితే.... భామాకలాపంలాగే, ఈ గొల్ల కలాపం కూడా వివిధ ప్రాంతాలలో వివిధ రూపాంతరాలు పొంది ప్రదర్శింప బడుతున్నట్టు

తెలుస్తున్నది. అన్నిటికీ 'మూలం' అనదగిన గొల్ల కలాపం అనే 'ఆత్మ యజ్ఞము' కూచిపూడిలోనే పుట్టింది. కర్త సకల శాస్త్ర పారంగతుడు, యోగ విద్యావిశారదుడు అయిన శ్రీ భాగవతుల రామయ్య. మిగిలినవి ఎవరు వ్రాశారో, ఎప్పుడు వ్రాశారో తెలియదు.

మన సాహిత్య సంగీతాల వలెనే నాట్య నాటకాలు కూడా నిర్లక్ష్యానికి గురైనాయి. నిరాదరణ పాలయ్యాయి. వాటి ఘనతనూ, సార్వజనీనతనూ మనకంటే ముందుగా 'ఇతరులే' గుర్తించారు, కీర్తించారు. అన్యదేశీయులు మన భారతీయ కళా సాహిత్యాలను, సంప్రదాయాలనూ శిరసావహించి ప్రస్తుతిస్తూ ఉంటే మన యువతరం మాత్రం పాశ్చాత్య నాగరికతా వ్యామోహ ప్రవాహంలో పడి గమ్యం ఏమిటో తెలియకుండా ఎటో కొట్టుకొనిపోతూ ఉంది.

ఈ పరిస్థితి మారాలి. మన సంస్కృతిని, సంప్రదాయాన్నీ, సాహిత్యాన్నీ, కళల్నీ మన "యువ హృదయం" ఆదరించాలి. క్రొత్త జవ జీవాలతో జాతి నూతన చైతన్య స్ఫూర్తి పొందాలి. అందు కెంతో కృషి జరగాలి.

ఆ కృషిలో భాగమే ఈ ఆత్మ యజ్ఞమనే గొల్ల కలాపం ప్రచురణ.

విశేష శ్రమ కోర్చి, పరిశోధించి, సంపాదించి, సంస్కరించి ఈ పుస్తకం ప్రచురించిన కీ. శే. చింతలపాటి లక్ష్మీనరసింహశాస్త్రిగారికి ఆంధ్ర దేశం, అందునా ముఖ్యంగా కూచిపూడి నాట్యరంగం ఎంతో ఋణపడి ఉంది.

కూచిపూడి నాట్య సంప్రదాయానికి ఒక విశిష్టత నాపాదించి పెట్టిన ఈ 'ఆత్మ యజ్ఞ' మనే గొల్ల కలాపం తిరిగి చక్కగా అభ్యసించి ప్రదర్శించటం ఒక్కటే శ్రీ నరసింహశాస్త్రిగారికి కూచిపూడి కళాకారులు సమర్పించుకో గలిగిన ప్రతిఫలం.

నాట్యం భిన్న రుచేర్జనస్య
బహుధా ప్యేకం సమారాధనమ్

హైదరాబాద్, 24-7-87 — పి. వి. ఆర్. కె. ప్రసాద్

శ్రీ గురుభ్యో నమః

# కృతజ్ఞతలు

కూచిపూడి యక్షగాన ప్రదర్శనములలో తలమానికములు భామాకలాప గొల్లకలాపములు. వస్తు వైవిధ్యంగల ఈ కృతులు మహర్షుల కృతాలు; జ్ఞానాంజన శలాకలు. కాలపరిణామములో కట్టుబాటు కలిగిన కుశీలవులు కొఱవడిన కారణముగ గొల్లకలాప ప్రదర్శనము కనుమరుగైనది. పరిశీలించు నాథుడు లేక, గ్రంథము గూడ జీర్ణము కాసాగినది. శ్రీరామయ్యగారి గ్రంథ మీవిధముగ కళాభిజ్ఞులకు దూరమగుటను భరించలేని శ్రీరామలింగశాస్త్రిగారు తన ప్రియశిష్యుడు పండితరత్న శ్రీ చింతలపాటి లక్ష్మీనరసింహశాస్త్రిగారిని చేరబిలిచి గ్రంథ సంబంధమైన ఆవేదనను వెలిబుచ్చిరి. శ్రీ చింతలపాటి వారు ఆ గ్రంథప్రతిని ఇచ్చిన యెడల పరిష్కరించి ప్రకటింతునని వినమ్రతగ పలికిరి. ప్రియశిష్యుని విజ్ఞతకు, పరేంగితావగాహనకు పరమానంద భరితులై బ్రహ్మశ్రీ భాగవతుల రామలింగశాస్త్రిగారు గొల్లకలాప తాళపత్రి ప్రతిని శిష్యునకు అందించి అచిరకాలములోనె బ్రహ్మైక్య మందిరి. తాళ పత్రి ప్రతిని స్వీకరించిన శ్రీ చింతలపాటివారు ఆ గ్రంథ పూర్వాపరములను నిశిత దృష్టితో పరిశీలించి కీటకములచే తిని వేయబడి, అస్పష్టముగ నున్న తావులందు కూచిపూడి నాట్యరీతుల నెఱిగిన కళాద్రష్టగ, కావ్యస్రష్టగ పరిణత బుద్ధితో పరిష్కరించి ముద్రణకు ఇచ్చి గురువర్యులకు ఇచ్చిన మాటను నిలబెట్టుకొనిరి. “నా నృషిః కురుతే కావ్యమ్”, ‘నాటకాంతం హి సాహిత్యమ్’ అను ఆర్యోక్తులకు లక్ష్యమైన శ్రీ చింతలపాటి శాస్త్రిగారి అవిరళ కృషికి, అకుంఠిత దీక్షకు, అపార పాండితీ వైభవమునకు, బహుముఖ ప్రజ్ఞాపాటవము నకు, గురుభక్తికి ప్రతీక అయిన ‘ఆత్మయజ్ఞమను గొల్ల కలాప’ పరిష్కార ప్రబంధములోని ఉచితానుచితములు సహృదయ పాఠకలోకమె నిర్ణయించ గలదు.

ఈ గ్రంథ పరిష్కరణకు, ప్రచురణకు, దోహదకారులైన గురుదేవులు కీ॥ శే॥లు బ్రహ్మశ్రీ భాగవతుల రామలింగశాస్త్రి గారికి, తదితర సౌజన్య మూర్తులకు మా హృదయ పూర్వక వందనములు.

పరంధాముని దివ్యధామమును చేరనున్న తరుణముతో శ్రీ చింతలపాటి శాస్త్రిగారు తన అనుగు శిష్యురాలైన స్వర్గీయ శ్రీమతి ఘట్టమనేని ఝాన్సీ లక్ష్మి ఆత్మశాంత్యర్థము ఈ ఆత్మయజ్ఞమును అంకిత మిచ్చెదనని ఆమె తండ్రి గారికి నివేదించిన వెంటనే సహృదయతతో అంగీకరించిన వదాన్యులు, శ్రీ జలదీశ్వర విశాల సహకార పరపతి సంఘ అధ్యక్షులు, మచిలీపట్టణం శ్రీ కృష్ణా కో-ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు డైరెక్టరు అయిన శ్రీ వేమూరి నాంచారయ్యగారికి మా నమోవాకములు. కృతి భర్తృక శ్రీమతి ఘట్టమనేని ఝాన్సీలక్ష్మికి మా జోహారులు.

ఆధ్యాత్మిక భావ మిళితమైన ఈ గొల్లకలాప యక్షగాన దృశ్య కావ్యమునకు 'కళాంజలులు' అందించిన భరత కళా ప్రపూర్ణులు, పేరిణి ఇంటర్ నేషనల్ సంస్థ అధ్యక్షులు, డాక్టరు శ్రీ నటరాజ రామకృష్ణగారికి మా నమస్సుమాంజలులు.

ఈ గ్రంథమునకు 'కళాసృష్టి-ఆధ్యాత్మిక దృష్టి'ని సమర్పించిన సాహితీ ప్రియులు ఆంధ్రప్రదేశ్ ఎక్సైజు శాఖ కమీషనరు శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్ I. A. S గారికి మా ధన్యవాదములు.

ముఖపత్ర సేకరణ యందును, గ్రంథముద్రణ విషయమునను విశేషాసక్తి కనబరచి శ్రమించిన మా చిరంజీవి చింతలపాటి వెంకటేశ్వరస్వామికి శుభాకాంక్షలు.

'Face is the index of the mind' అను ఆంగ్లసూక్తి కనుగుణముగ గ్రంథస్థ విషయం అభివ్యక్తమగునట్లు ముఖపత్రి రచన గావించిన ప్రముఖ చిత్రకారుడు శ్రీ శ్రీకృష్ణగారికి మా కళాంజలులు.

కీ. శే॥లు శ్రీ చింతలపాటి శాస్త్రిగారిపై గల అభిమానముతో మేలిరంగుల సొబగులను మేళవించి ముఖపత్రిమును నయనానందకరముగ రూపొందించి ఇచ్చిన విజయవాడ ఆఫ్‌సెట్ ప్రింటర్సు యజమానులైన శ్రీ పరుచూరి కిశోర్ బాబుగారికి మా ప్రత్యేకాభివందనములు.

ఉదారులు, సరసులు, ఆర్ష సంప్రదాయ ప్రచార కార్య దీక్షాపరులు, అంతర్జాతీయ సంస్థ 'జగద్గురుపీఠ' వ్యవస్థాపకులు కులపతి కీ. శే॥లు డాక్టర్ శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్యులవారి ప్రియతమ శిష్యులు, మా శ్రేయోభిలాషులు అయిన మచిలీపట్టణం త్రివేణి పబ్లిషర్స్ ప్రయివేటు లిమిటెడ్ ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్ శ్రీ చింతలపాటి సూర్యనారాయణరాజు గారికి, వారి సోదరులు శ్రీ సాయిబాబాగారికి, వారి ముద్రణాలయ సిబ్బందికి మా ప్రణామములు.

ఇంకను ఈ గ్రంథము వెలుగు చూచుటకు కారకులైన మహాత్ములకు మా కృతజ్ఞతలు

ఇట్లు
బుధజన విధేయుడు
చింతలపాటి పూర్ణచంద్రరావు

ఘంటశాల
ది. 3-8-'87

# దిగ్దర్శనము

ఇయ్యది 'ఆత్మయజ్ఞము' అను మహత్తరదృశ్య ప్రబంధము. ఒక విధమగు కలాప ప్రక్రియ. దీనిని కూచిపూడి గ్రామ నివాసులు యోగవిద్యా విశారదులు, మహాపండితులు, అభినయ విద్యా ధురంధరులు, బ్రహ్మీభూత భాగవతుల రామయ్యగారు రచించిరి. వీరి కాలము క్రీ. శ. 18_వ శతాబ్ది పూర్వార్ధము.

శ్రీ రామయ్యగారి తండ్రి రామలింగంగారు. వీరు యోగ శాస్త్రపారంగతులు. ఆత్మయజ్ఞమును జేసిన పరిపూర్ణులనియు, తమకు గురుపాదు లనియు నీ గ్రంథాంతమున పేర్కొన బడినది. రామయ్యగారు వీరికి ఏకపుత్ర విశేషము.

శ్రీ రామయ్యగారు నాట్యకళా ధురంధరులే కాదు, సరస కవులు. ప్రకాంత పండితులే కాదు, సమర్థులగు సూత్రధారులు. మధుర మార్దంగికులే కాదు, సంగీత విద్యానిపుణులు. యోగవిద్యా ప్రవీణులే కాదు, యోగాభ్యాసనిరతులు కూడ. పచ్చని మేని చాయ. పలుచని శరీరము. బ్రహ్మతేజస్సు ముఖాన ఉట్టిపడుతూ ఉండేది. జంత్ర గాత్రములందే గాక, వేదాంతాది శాస్త్రములలో గూడ అపార పాండిత్యం గల మనీషి. బహుముఖ ప్రజ్ఞాప్రభావిలసద్భా స్కరులు, వీరు.

కృష్ణా జిల్లాలో ప్రసిద్ధ బౌద్ధక్షేత్రంగా ప్రఖ్యాతి వహించిన ఘంటశాల వీరికి ప్రధాన కార్యక్షేత్రం. కుమారి పువ్వుల నరహరి, వేంకటరత్నం మున్నగు దేవదాసీలకు అభినయ శిక్షణ మిస్తూ యుండేవారు. అనుదినం బ్రాహ్మీ ముహూర్తాన లేచి నిత్య కర్మాను ష్ఠానములు, యోగాభ్యాసాది సాధనలు ముగించుకొని శిష్యా ళాండ్రకు శిక్షణ మీయటానికి గరిడీ చోటునకు వెళ్ళేవారు. అక్కడినుండి మధ్యాహ్న సమయానికి మరలి వచ్చి మాధ్యాహ్నిక కార్యకలాపాలు బ్రహ్మయజ్ఞము, పితృయజ్ఞము, తర్పణము, దేవతార్చనము, వైశ్వదేవాదికములు ముగించి భుజించేవారు. అటు తరువాత, విశ్రాంతి. మరల శిక్షణ. ఇదీ వీరి నిత్యకృత్యం. వీరి ప్రతిమాటలో, చేతలో పారమార్థిక చింతన తొణికిస లాడుతూ యుండేది. కనుకనే, ప్రతివ్యక్తి వీరిని ఎంతగానో గౌరవించేవారు.

వీరు బ్రహ్మజ్ఞాన పరిపూర్ణులై, అంతర్ముఖులై 'పిండోత్పత్తి' 'యజ్ఞపట్టు,' అను రెండు మహత్తర విషయ విలసితమైన 'ఈ ఆత్మ

యజ్ఞము,' అను కలాపాన్ని రచించినారు. కొంతమంది దీనిని 'గొల్ల కలాపము,' అని కూడ అనేవారు. కూచిపూడి సంప్రదాయ దృశ్య ప్రబంధాలలో భామాకలాపము మొదటిది కాగా, యీ ఆత్మ యజ్ఞము రెండవది. దీన్ని ప్రదర్శించడం సాధారణమైన విషయం కాదు. ఎంతో పాండితీ గరిమ, చాకచక్యం, ఉపజ్ఞ ఉంటే గాని వలను పడని విషయం. ప్రస్తుత కూచిపూడి నాట్య కళాక్షేత్రంలో ఈ కలాపాన్ని ప్రదర్శించి రక్తికట్టించగల సమర్థులు లేరు. కనుకనే, ఈ గ్రంథం మరుగున పడటమేగాక, ప్రదర్శనం కూడ కనుమరుగైంది. ఒకప్పుడు కీ. శే. తాడేపల్లి పేరయ్య, భాగవతుల విస్సయ్య, వేదాంతం లక్ష్మీనారాయణ, వెంపటి వెంకటనారాయణ, చింతా వెంకట రామయ్య, భాగవతుల రామలింగం, భాగవతుల రామయ్య మున్నగు వారలు తాము ప్రయోగ విశారదులై, ప్రయోక్తలుగా దేవదాసీలచే అభినయింప జేసేవారు. అనంతరం కీ.శే. వెంపటి పెదసత్యనారాయణ భాగవతుల రామకోటయ్యగారలు, ఈ ప్రదర్శనము నివ్వడములో సిద్ధహస్తులు. వారితో బాటు ఈ ప్రదర్శనం కూడ కూచిపూడి కళాక్షేత్రం నుండి నిష్క్రమించి ఆధునిక ప్రదర్శనలు చోటు చేసికున్నాయి.

ఈ కలాపంలోని కొంతభాగాన్ని కీర్తిశేషులు బందా కనకలింగేశ్వరరావుగారి దర్శకత్వంలో, ఆచార్య పింగళి లక్ష్మీ కాంతంగారు పరిష్కర్తలుగా, 'కళాప్రపూర్ణ' చింతా కృష్ణమూర్తిగారి సూత్రధారిత్వంలో రేడియో ప్రసారంగా ఎంపబడింది. తరువాత దీని ప్రసక్తి ఎవరికీ పట్టలేదు. శ్రీ రామయ్యగారి స్వహస్త లిఖిత తాళపత్ర గ్రంథం నుండి వారి కుమారులు రామలింగశాస్త్రిగారి పర్యవేక్షణలోనే నేను 1956 లో ప్రతిలిపి చేశాను. శ్రీ రామలింగ శాస్త్రి వర్యులకు ఈ కలాప మంతా కంఠస్థము. దీనిలో కొన్ని ఛందో లక్షణములు స్వతంత్రములు. వేదాంత సంబంధంగా భగవద్గీత, పతంజలి యోగసూత్రములు, 'జ్ఞానవాశిష్టము,' 'యోగవాశిష్టము' మున్నగు గ్రంథాలు ఆధారంగా గ్రహించినట్లు బోధపడుతుంది. ఒకమారుపఠిస్తేశ్రీ రామయ్యగారికవితా వైదుష్యం, ప్రయోగంలోని కష్టసుఖాలు, విషయ ప్రతిపాదనా సామర్థ్యం, యోగవైశారద్యం, పాండితీ ప్రాగల్భత్వం సంస్కార ప్రాబల్యం ప్రస్ఫుటమౌతాయి.

ఘంటశాల — సంపాదకుడు

మే 1956 — చింతలపాటి లక్ష్మీనరసింహశాస్త్రి

ఓమ్

శ్రీ శారదాంబాయై నమః

# ఆత్మయజ్ఞము

## విఘ్నేశ్వర స్తవము

శ్లో. అగజానన పద్మార్కం । గజానన మహర్నిశం ।
అనేకదం, తం భక్తానాం, ఏకదన్త ముపాస్మహే ॥

### దేవీ ప్రార్థన - చతురస్రగతి

అంబా ! పరాకు దేవీ ! పరాకు,
మమ్మేలు మా శారదాంబా ! పరాకు ॥
వాణీ ! పరాకు గీర్వాణీ ! పరాకు,
వాణీ ! చక్కని నీలవేణీ ! పరాకు !
ఓంకారి ! కౌమారి ! వారాహి !
శర్వాణి ! శాంకరివౌలోకశక్తి పరాకు !
ఈ రీతిగ నిన్ను కోరిన వారిని
గావవె, కనకదుర్గాంబా ! పరాకు !
సరసిజలోచను చెల్లెలివై మమ్ము
గరుణించు బంగారుతల్లీ ! పరాకు !
ఆరు వీథుల నడుమ అలరారు, బం
గారు మేడలో వెలసిన బాలా ! పరాకు !
మూడు మూర్తుల కిలను మూలమౌ కూచి
పూడిలో వెలయు పూబోడి పరాకు !
కనకాభ్రమ జలధిలో జలకము లాడుచు,
కులుకుచు దరిగేటి కలికీ ! పరాకు !

వచ: అని ఈ విధంబుగ విఘ్నేశ్వర ప్రార్థనంబును, దేవీ ప్రార్థనంబును గావించిన యనంతరంబు భామా ప్రవేశంబు ఎట్టి దనిన :

**(భామ చల్లకుండ తలపై ధరించి పాడుకొనుచు ప్రవేశించును)**

భామ :

పాలో, యమ్మ ! పాలు,
చల్లో, యమ్మ ! చల్ల,
చల్లో, యమ్మ ! చల్ల,
పాలో, యమ్మ ! పాలు.

బ్రాహ్మ : (వచ.) ఓ తరుణీమణీ ! నీ ముఖారవింద సుందర వచో విలాసంబులు, వయారంబులు చూడగా, నా డెందమ్మునకు ఆనందంబయ్యె, నీ వెవ్వరవో సభకు తెలుపుమమ్మా !

భామ, (వచ) : స్వామీ ! మేము గొల్లవారమయా :

బ్రాహ్మ, (వచ) : ఆహాహా ! (నవ్వుచూ) ఏమి వారము ? ఆదివారము, సోమవారము మున్నగు వారములను విన్నాము కాని గొల్లవారమును వినియుండలేదమ్మా !

భామ, (వచ) : ఓ స్వామీ ! మీ వాక్చాతుర్య ప్రౌఢిమలు, తేజో విశేషంబులు చూడగా నా మనంబున నొక్క సందియము కల్గినది. దానిని మనవి చేసెదను, సమాధానము నొసంగుడీ మహాత్మా !

బ్రాహ్మ, (వచ) : భామామణీ ! నీ సందియము లెన్ని యైనను నిస్సంకోచంబుగ నడుగుము. నేను సందియము నందక సదుత్తరంబుగ చెప్పెదను. అడుగుమా, కుందరదనా !

భామ : ఆ. వె. ఎవ్వరొకొ్కొ మీర లెరిగింపు డిందరు
విసగ మీ కులంబు వివరణంబు !
చెయ్వు లెప్పు డేమి చేయుదురో ? వాని
నెల్ల దెల్పుమయ్య ! నేర్పు మెరయ.

బ్రాహ్మ : ఆ. వె. యజన యాజనాది యఖిల కర్మల నెప్పు
డెద్ది సేయ వలయు నద్ది యపుడె
మొనసి సల్పు బ్రహ్మముఖ సముద్భవమైన
బ్రాహ్మణుల మె, గొల్లభామ ! మేము.

వచ : లలనామణీ ! మేము 'యజన, యాజన, అధ్యయన, అధ్యాపన, దాన, ప్రతిగ్రహణము' లను షట్కర్మలను ; ఇంక పుంసవన, జాతకర్మ, నామకర్మాది షోడశ కర్మలను ; ఏది, ఏవేళ యందు జేయవలయునో ఆ యా సమయములందు వేద మంత్ర యుక్తముగా జేయు బ్రహ్మముఖ సముద్భవులమగు బ్రాహ్మణ లమే భామామణీ !

భామ, (వచ) : ఎంత విపరీత భాషణము చేసితిరి స్వామీ !

దర్వు - ఆదితాళం - పంతువరాళి రాగం

తలిదండ్రుల వలన కలిగినట్టి, యీ
తనువు లన్ని యొకటే కాదా !
ఇలలో మే మధికుల మను నతిశయ
ములు తొలగగ నే తెలిపెద వినుడీ ॥ తలి ॥

వచ. : అయ్యావారూ ! అధికుల మనే అహము మ వీడి నా మనవిని జేకొనుడు. ఈ లోకములో తలిదండ్రుల వలన కలిగిన శరీరము లన్నియు నొకటియే కదా !

బ్రాహ్మ. దర్వు : ఆదితాళం - పంతువరాళి రాగం

చెలియ ! వినవే. ఈ ఇల గల జనులలో
తెలియక ఒక్క టనియెదే ! ఇప్పుడు.
తొలుత వేద సత్కర్మలను జేసి, వాని
బలముచె ద్విజులమై
ప్రస్తుతి నొందెదము ॥ చెలి ॥

వచ : ఓ తరుణీమణీ ! అందరు జనులవలె మమ్ముం జెప్ప దగదు. వేదములయం దుద్భవించిన కర్మలను జేయుట వలన మేము ద్విజన్ములమైతిమికదే తరుణీ !

భామ, దర్వు : నిర్మలాత్మ ! ఆ విహిత నిఖిల స
త్కర్మలను జేయ ' వీని
మేను కంటె నేను పరుడ'నని మది
లోన దెలియలేని మనుజులకు దమ ॥ తలి ॥

వచ. : మహానుభావా ! సత్కర్మల నెన్ని జేసినను 'నేను ఈ శరీరముకంటె పరుడను ' అని తెలియని వారికి ప్రయోజన మేమయా, స్వామీ !

బ్రాహ్మ, దర్వు : వేద విహిత కర్మల జేసి, దే
హాదుల భ్రమ బో విడచి ।
'బోధ రూపుడను నే' నటంచు బాల్యా
మాది ఘనులమై, మోద మందెదము ॥ చెలి ॥

వచ : వేద విహిత సత్కర్మల నాచరించి, దేహ భ్రాంతి వీడి, 'బోధ రూపుడగు పరబ్రహ్మము నే నే' అను భావముతో బాల్యము నుండి వర్తించుచుంటిమే తరుణీ !

బ్రాహ్మ, దర్వు : పంచమహాయజ్ఞములను జేసి, మె
ప్పించ గలరే ? - దేవ ! నిక్కమ

టంచు మదిని గర్వించి, పరుల నిం
దించి, కూచిపూడి పురీశు గాన, తరమ ॥ తలి ॥

వచ : పంచమహాయజ్ఞములను జేసినంత మాత్రమున, ఆ ఈశ్వరుని దెలిసికొంటిమని గర్వించి, ఇతరులను నిందించుట కూచిపూడివాసుడగు శ్రీ రామలింగేశ్వరుని ఎరుగలేకపోవుట కాదా, స్వామి !

బ్రాహ్మ, దర్వు : పంచమహాయజ్ఞములుచేసి, మె
ప్పించెదము మేము, తొలుతను
చంచలాక్షీ ! పర బ్రహ్మ ముఖమ్మున జ
నించి, బుధులమై సంచరించెదము ॥ చెలి ॥

వచ : మేము పంచమహాయజ్ఞములచే నీశ్వరుని మెప్పింతుము. పరబ్రహ్మముఖ సముద్భవులమైన బ్రాహ్మణులముకదా, భామా !

భామ : కం. పంచమహాయజ్ఞములను
మంచిగఁ జేసితి మటంచు మదిలో గర్వం
బుంచక, బ్రహ్మముఖమున జ
నించిన బ్రాహ్మణులమని వచించుట, తగునా !

వచ : 'పంచమహాయజ్ఞముల నాచరించినాము' అను గర్వముతో బ్రహ్మముఖసముద్భవుల మనుట తగునటయ్యా, స్వామి !

బ్రాహ్మ : కం. తరుణిరో ! జన్మముతో మే
మరయగ బ్రాహ్మణులమంచు నరయక, నీ వి
త్తెరగున బలుకుట తగునా ?
గురి మేరయు లేక నీవు, కొంటిగ మాతో ।

వచ : మేము పుట్టుకతోడనే బ్రాహ్మణులమే, భామామణీ !

భామ, వచ : అలాగున కాదయ్యా స్వామీ ! ఎందువలన నంటే,

ఆ. వె. జన్మచేత బ్రహ్మజాతంబు లెటు లగు ?
అందరకును పుట్టు వనగ నొకటె.
అదియు వినుము 'జన్మనా జాయతే శూద్ర'
అనెడి శ్రుతియు కల్లె ? అమ్మ జెల్ల !

వచ : 'జన్మనా జాయతే శూద్రః' అను శ్రుతి ప్రమాణముచే నీ లోకమున జన్మించిన దేహధారు లందరు శూద్రులే గాని, బ్రాహ్మణులు కారుగదయ్యా, స్వామీ !

బ్రాహ్మ! ఆ. వె. బాగు, భామ ! బాగు బాగు, నీతోడనే
కలహ మిపుడె చేతు ; కాని ధర్మ
శాస్త్రవాక్య మొకటి చదివితి నిప్పుడు
దేహి జన్మ మొందు తీరుఁ జెపుమ !

వచ : మేలు మేలు. మంచిమాట లాడితివి. ధర్మశాస్త్ర వాక్యమును జెప్పితివి. అది పూర్వపక్షమో, సిద్ధాంతమో యోచింప వలయును. కాన, ఈ దేహికి ఈ జన్మ కలుగుట ఎటులనో వివరింపుమా, భామా !

**భామ, దరు : దర్బారు రాగం - చతురశ్ర త్రిపుట**

వినుడి ! జీవుడు గర్భమున జొచ్చియు
దేహ మొందు వివర మంతయును దెల్పెద ॥ విను ॥
తన పూర్వ కర్మమున, తనువు తానని యెంచి
ఘనమగు మోహమున గానలేకా తనుండి ॥ విను ॥
సార రహిత సంసారమె స్థిరమంచు
దార సుతుల ప్రేమ దగిలి తనుండి ॥ విను ॥
సారెకు కూచిపూడిస్వామి రామలింగేశ్వరుని
కోరి భజియించ లేక కొరమాలి, తనువు దొరకె ॥ విను ॥

మ త్తే : తొలి జన్మంబున దాను జేసిన
మహాదుష్కర్మ, సత్కర్మకున్
నిలయంబై తగు పుణ్యలోక
నరకానీకంబులం బొంది, అ
వ్వల దా జన్మము వచ్చునప్పు డతుల
వ్యాజంబుతో నేమి గా
గలడో, తెల్పెద చిత్తగింపుడు
మదిన్ గౌతూహలం బొప్పగన్॥

వచ. : ఈ దేహాభిమానియగు జీవుడు గత జన్మమునందు తాను చేసిన పుణ్య పాపముల ననుసరించి స్వర్గ నరకముల ననుభవించి, తిరుగ జన్మము వచ్చునప్పు డెటువలె నవునో దానిం దెల్పెద, చిత్తగించెదవటయ్యా, స్వామీ !

బ్రాహ్మ. : కం. అటులనె విని యెద నిక నీ
పటుతర వాక్ప్రౌఢి మెరయ, భావమున సుధా
ఘుటికవలె రుచులు పుట్టగ
నిటు బలుకుము గదవె సొంపు నింపగ, కొమ్మా !

వచ. : తరుణీరత్నమా ! నీ వాక్చాతుర్య మెల్లవారికిని దెలియు నటుల, మా మానసములందు నమృతగుళిక జిహ్వాగ్రము నందుంచి నటుల రుచులు కలుగు విధమున చెప్పుమా !

భామ : సీ మునుకొని జీవుండు మొనసి నక్షత్రమై
ఆకాశమున గొన్ని యహము లుండి
ఆదిత్యకరములం దణగి కొన్ని బవళ్ళు
హిమకణంబై యంత నిలకు రాలి
ఓషధీ రూపమై యొనర గొన్నాళ్ళుండి
అటు మీదట చతుర్విధాన్నమగుచు
పురుషుని కాహార భూతమై యాతని
పొట్టలో శుక్లమై బొలచి కొంత

తే. గీ. కాలము వసించి ఋతువేళ కాంత గర్భ
మందు శోణితమున గూడి యంత గట్టి
పడుచు నొక ముద్దయై పాణి పాద పాయు
వాది సర్వేంద్రియములు నుద్భవము లగును.

వచ. : స్వామీ ! ఈ జీవుడు జన్మ నొందుటకు ముందు నక్షత్ర రూపమై యాకాశమున గొంత కాల ముండును. సూర్య కిరణములలో కొన్నాళ్ళుండును. అటుమీదట మంచుకణమై భూమిపై రాలి, సస్యరూపమై వృద్ధిపొంది, చతుర్విధాన్న రూప మగును. చతుర్విధాన్నము లనగా నమలి మ్రింగునది; కొరికి తినబడునది, మ్రింగబడునది, చప్పరింపబడునది అని ఎరుగు మయా, స్వామీ ! ఈ ఆహారము తొలుత పురుషునిచే భుజింపబడి, శుక్లరూపమై స్త్రీ ఋతుకాలమున...

బ్రాహ్మ, (వచ : ఆగు మాగుము. తరుణీ ! మేము పండ్రెండు మాసములు, వసంతాది షడృతువులను విని యున్నాము. కాని, స్త్రీ ఋతుకాలము నెచ్చట విని యుండ లేదు. అది ఎటులనో చెప్పుమా, భామామణీ !

భామ, వచ : స్త్రీ ఋతుకాల మనగా,

కం. మదవతి పుష్పించిన యా
పదునారవ దినము వరకు భావింపంగా
సదమల ! ఋతుకాలంబని
విదితంబుగ దెలియ వలయు విబుధులు మహిలో.

వచ : స్త్రీ బహిష్టు అయిన దినము మొదలు పదునారవ దినము వరకు ఋతు దినములు కదయ్యా, సామీ !

అది ఋతుకాల మనబడును. ఈ సమయమున స్త్రీ పురుష సంయోగము జరిగినచో శుక్రశోణిత రూపమున మిశ్రితమైయున్న

బీజము స్త్రీ నాభికమలము నందు ప్రవేశించి యేమగునంటే చెబుతాను వినవయ్యా, సామీ!

కం. తగ శుక్ర మధికమైనను
మగవాడై పుట్టు, పిదప మరి శోణితమే
మిగులుగ నుండిన మగువగు
జగతిని, నవి సమములైన షండుడు పుట్టున్.

వచ.: పురుష సంబంధ శుక్రమున్నూ, స్త్రీ సంబంధ శోణితమున్నూ కలియునపుడు, తన కర్మాను రూపంబులగు జన్మంబు లెత్తును. శోణిత మధిక మగుచో స్త్రీ శిశు వగును. శుక్ర మధికమగుచో పురుష శిశు వగును. ఈ శుక్ర శోణితములు రెండును సమము లగుచో నపుంసకు డగును. బీజద్వయం బగుచో శిశు ద్వయం బగును. ఆ బీజము స్త్రీ నాభికమలమందు ప్రవేశించి ప్రవర్ధమాన మగును. ఈ లోకమున కొందరు దంపతులకు సంతాన హీన మగుటకు కారణము చెప్పెదను. ఆలకింపుమయా, బావనయా!

కం. ఋతువులు మది గని స్త్రీలును
పతులును మరి గూడ గర్భ ఫలితంబవుగా!
మతి చలనము నత్తరిలో
పతిపత్నులకు నున్న పుత్ర భాగ్యము కలదే!

వచ.: రమించు తరి సతీ పతులకు మతి చలనము కలిగినటు లయితే, అది సంతాన హీనతకు కారణము కాదంటయ్యా, స్వామీ! ఇక్క మతిచలన మంటే అధిష్ఠాన వస్తు విలోకమునకు కర్మ అడ్డు పడుటయే మతిచలన మనబడును. అది సంతాన హీనతకు కారణము కాదంటయ్యా, స్వామీ!

సీ. కాంతతో పురుషుండు గలిసిన యా రాత్రి
చింతపండు, పెరుగు జేరు భంగి
పంచ రాత్రులలోన బరగ బుద్బుద మౌను
పిండంబు పక్షాన పేర్మి దాల్చు
మాసంబులోపల మరి శిరం బేర్పడు
ఇరుమాసముల బాహు లిరవు దాల్చు
మూడవ మాసాన ముదముతో నుదరంబు
పాదాది కరణ సంపద ఘటిల్లు!

ఆ. వె. నాల్గవ నెలయందు నవరంధ్రములు కలిగి
మాతృగర్భమందు మసలుచుండు
మాస పంచకాన మాంస రక్తాదులు
ఆరవ నెల నఖము లమరి యుండు!

వచ.: ఇట్లు ఋతుకాలమును గురుతెరింగి సతీ పతులు సంయోగం బొనరించినచో శుక్ర శోణిత సమ్మిళితమైన ఆ బీజంబు స్త్రీ నాభికమలమందు ప్రవేశించిన మొదటి రాత్రియందు చింతపండు, పెరుగు కలసిన విధముగ నుండును. అయిదు దినములకు నురుగువలె నగును. పదిహేను దినములకు అడుసు మాదిరిగ నుండును. క్రమక్రమముగ నది గట్టిపడి పిండరూపము ధరించును. ఒక మాసములో శిరం బేర్పడును. రెండవ నెలలో బాహు ద్వయంబును, మూడవ నెలలో ఉదరంబు, పాద హస్తాదికము లేర్పడను. నాల్గవ నెలయందు నవరంధ్రములు కలిగి మాతృ గర్భము లో కదలుచుండును. అయిదవ నెలయందు రక్త మాంసాదులు వృద్ధి యగును. ఆరవ మాసంబున నఖ దంత కేశములు; డెబ్బదిరెండు వేల నాడులు నేర్పడును. ఏడవ నెల యందు పరిపూర్ణమైన జీవత్వమును పొంది జ్ఞానము కలిగి, 'మావి', అను లోకవాడుక కల తిత్తి లోపల తానుండి మాతృ భుక్తాన్నరసంబులో గొంత తా ననుభవించుచు – నది సాత్త్వికాహారంబగుచో

నానందించుచు, రాజసాహారం బగుచో సముచితుడై, తామ సాహారంబగుచో వ్యసన పడు చుండును కాదంటయ్యా, స్వామీ !

బ్రాహ్మ. వచ : ఈ ఆహారముల లక్షణము లేవో వివరింపుమా, భామా రత్నమా !

భామ : అటులనేసయ్యా, సాత్త్వికాహార మనగా మధుర పదార్థములతో గూడినది. రాజసాహార మనగా కమ్మగా, చప్పగా నుండునది. ఇక తామసాహార మనగా కారము, ఉప్పు చేదు, ఒగరు మున్నగు పదార్థములతో గూడినది కాదటయ్యా, స్వామీ ! ఇక నా శిశువు మాతృ భుక్తాన్నరసము నెట్లు అనుభవించుచుండునో వినుమయా !

చం. మిగులగ నాభి రంధ్రమున
 భ్రమింగుచు నున్న రసంబు నెవ్వగన్
 బొగులుచు నిట్లనున్—తిరుగ
 బోవుట కిమ్మ గనంగలేక, మి
 న్నగు జఠరాగ్ని కీలముల
 నంటిన తప్తము నొంది యార్చుచున్
 బెగడి మనంబునన్ హరిని
 బిట్టు దలంచుచు నిట్లు పల్కెడిన్ ॥

వచ : ఆ మాతృగర్భములో నున్న శిశువు 'మావి' అను తిత్తి లోపల నుండి మాతృ భుక్తాన్న రసంబును, గొంత నాభి నాళము ద్వారా తా ననుభవించుచు నుండును కాదంటయ్యా !

శ్లో. నాభి సూత్రాల్ప రంధ్రేణ, మాతృ భుక్తాన్న సారతః ।
 వర్ధతే నాభిగః పిండో న మ్రియతే స్వకర్మతః ॥

వచ : నాభినాళ మందలి సూక్ష్మరంధ్రము ద్వారా, మాతృ భుక్తాన్న సారము వలన, గర్భమందున్న శిశువు వృద్ధి నొందు చున్నది. అది తన కర్మ ఫలము వలన నాశము నొందదు.

ఇట్లు ఆహారము ననుభవించుచు నటు నిటు తిరుగుటకు వెసులుబాటు గానక, తల్లి జఠరాగ్ని కీలలకు తప్తము నొందుచు, క్రిందికి బోవుచున్న నచటి మల మూత్రముల కసహ్యము నొందుచు నెటు వెడలుటకు వీలు గానక, ఎటు వలెనుండునో చెప్పెదను, విను, మయ్యా, స్వామి!

బ్రాహ్మ : కం. కాయము వర్ధిల దినదిన
* 'మాయము పాత్రిదేశమాత్రి మతి యేహ్యము న
త్యాయాసము నైన యుదర
మాయ తనము గాగ నెట్లు అతుడుండుగదే!

వచ : గర్భస్థుడైన శిశువు నానాటికి తన శరీరము వృద్ధి నందుచుండగా, కొలదియై గుహావలె నున్నదియు; ఏహ్యమై మిక్కిలి కష్టతరమగు నాగర్భ గృహములో నెటువలె నుండునో చెప్పుమో తరుణీమణీ!

భామ : కందార్థము - అట తాళము - శంకరాభరణము

రుధిరమల మూత్రములకున్
అధి కాసహ్యమును జెంది హస్త పదాదుల్
గుడియించి కట్టి నట్టుల
మెదలక యొకచోటనుండు మేనుం బెరుగన్ ॥
వంతల జెంది లోన గరగుచున్
మేను తాననెడి యజ్ఞానముచే గన్న ।
గానక దేహాభిమానములో జిక్కి ॥ మేన్న ॥

వచ. : ఆ శిశువు మూత్ర పురీషాదుల కసహ్యము జెందుచు: చెయ్యి, కాలు మున్నగు సమస్తావయవములు బిగియ కట్టబడి కదులుటకు వశముగాక యుండును. ఇట్లుండుట వెనుక

* ఆయము = జన్మస్థానము.

జన్మమందు జడ రూపమే తానని, ఈ పాంచ భౌతికమగు దేహాభి మాని యగుట వలన కాదటయ్యా !

ఉ. ఆ జఠరాగ్ని కీలము లహర్నిశముల్
దరిగొంచు గాల్పగా
నో జగదాత్మ ! ఓ పరమయోగి హృదబ్జ
నివాస ! యో భవ
వ్రాజి తమః పతంగ ! పరిపాలిత సజ్జన సంఘ !
ఓ మహో
తేజ ! నమస్కరించెదను, తీవ్రత బాపగ
వేగ రాగదే !

వచ.: సర్వేశ్వరా ! ఈ జగత్తున కాధారభూతుడవు. నిత్యానిత్య వస్తు వివేకముతో నారూఢ జ్ఞానముగల పరమహంసల హృత్కమల నివాసుడవు. పాపాంధకారమును బోగొట్టు భాస్కరుండవు. సర్వ సంరక్షకుండవు నగు నీకు నమస్కారము. ఈ గర్భ నరక యాతన బాపుటకై అతి త్వరితంబుగ నీ దర్శనం బొసంగి రక్షింపవే అని ధ్యానించు చుండును కదయ్యా. అయ్యవారూ !

దరువు : అబ్బబ్బా ! ఎటులాసైతు నీ గర్భనరక వేదనలూ ।
గొబ్బున దీని వెడలుట నాకే దబ్బున దోచదేమందు ॥

గత జన్మమందు దేహము
సతమాని నమ్మి, సతీ
సుతులను బోషించుచూ
వెతల నంద వలసెగా
గతి నీవె కూచిపూడి
పతి రామలింగేశ్వరా ॥ అబ్బ ॥

శా. ఏవేళన్ జఠరానలం బిచట

నుండెన్, దీని దప్పింపగా!

తావున్ గానక, మూర్ఛలో మునుగు

చుండన్ జాల, రక్షింపగా!

నీవేతప్ప మరెవ్వరుం గలరె!

మన్నింపన్ దగున్; వేగ నీ

లావుంజూపుచు దీనునైన నను

సంరక్షించు సర్వాత్మకా.

వచ: అని పరాత్పరుని స్తోత్రము శేయుచుండును కాదంటయ్యా మరియు,

దర్వు - మిశ్రచాపు తాళము - ముఖారి రాగము -

ప్రారబ్ధ వశమున - చేరితి గర్భములో!

దారి తెలియదు – నేరమెంచకు!

దారి జూపుము - శ్రీహరీ ॥ ప్రార ॥

జఠరాగ్ని కీలలు – స్ఫుటమై యహర్నిశలు!

కఠినముగ దరి గొంచు గాల్పగ!

విఠలరాయ! కావవే ॥ ప్రార ॥

మల మూత్ర వాసనలు గల కుక్షిలో

పలను, దుర్వాసనలు జెందగ

వలసె; బ్రహ్మము దలచెదగా ॥ ప్రార ॥

కోరి, కూచిపూడికుడీ మూత్ర

ద్వారమున రమ్మనె, బ్రహ్మ వి

చారము మరచి వత్తునో ॥ ప్రార ॥

కం. త్రిగుణాతీత! పరాత్పర!
జగ దంతర్బహిరములను శాశ్వత మహితా!
విగళిత భవతాపజ్వర
నిగమాంతగ్గత విహార! నిను సేవింతున్!

కం. ఈ యుదర నరక యాతన,
బాయక ఇటు లెన్నినాళ్లు వాసము జేయం!
జేయుదువో, పరమేశ్వర!
మాయంబడి కానసైతి; మన్నింపగదే॥

వచ: అనుచూ, గర్భములో నున్న జఠరాగ్ని తపింప జేయగా, దానిం దప్పించుకొనుటకు వేరు తెరవులేక, సర్వమయుడైన పరాత్పరుని స్తోత్రము జేయుచు ఈ గర్భ నరకమున నెంత కాల ముండవలయునో, దీని నుండి బయలు వెడలుట ఎన్నటికో, బయలు వెడలిన పిదప తిరుగ జన్మహేతువులగు కార్యములు చేయ బూనను అని మొరలుపెట్టుచుండును కాదంటయ్యా, స్వామీ!

బ్రాహ్మ: కం. అబ్బబ్బ వింటి మిపు డా
గబ్బున నుండెడి శిశు వటు కష్టంబులలో
నిబ్బంగి నుండి; యెపు డా
సబ్బందుల బాసి వెడలు సమయము జెపువా!

వచ.: గర్భస్థుండై యుండెడి దేహికి గలుగు కష్టము లెల్ల వింటిమి. ఇటుల నెంతకాలము బాధల నొందునో, ఈ ఆయాసములు తొలగి ఎపుడు బహిర్గతుడగునో చెప్పుమా, భామా!

భామ: మత్తేభార్థము:

మదిలో సర్వచరాచరాత్మకుని స ద్బ్రహ్మేంద్ర వ్యాత్సంకజా
త దినేశుం, ప్రభు నప్రమేయ విభు, నాద్యంతాది
శూన్యుం ఘనున్

"ఉదర ప్రజ్వలితాగ్ని వాపి వెలి కేదో త్రోవ జూపింపవే"
యంచు దలంచుచుండును తుదిన్.

గానక తల్లడిల్లుచున్, నిర్వృత్తబ్రహ్మ ।
జ్ఞాని పోలిక వహింపుచున్ ।
మేనిలో జెప్పరాని ఆ మాతృజంతు :
యోని మార్గ ద్వారము బూని యథోముఖ :
గాను, పదోనెలలోన ప్రసూతిని
తా నిలబడగన్॥ కానక॥

వచ. : అవాఙ్మానసగోచరంబగు పరబ్రహ్మానుభవంబుగల బ్రహ్మజ్ఞాని వలె ధ్యానించుచు, గత మాసంబులను లెక్కించుచు భూ పతనమున కెదురు జూచుచుండ, పదియవ మాసంబున మొదటి భాగమున ప్రసూతి వాయువులు అధోముఖునిగ జేసిన, ఉచ్ఛ్వాస నిశ్వాసలు వెడలక తన్మయత్వంబు నొంది మాతృ రహస్య ద్వారము నుండి భూమిపై బడి మాయం గప్పబడి యుండును కాదంటయ్యా!

బ్రాహ్మ : కం. ఈరీతిగ నిర్గమించియు
ధరాతలంబున నతండు తప్పన్ బాధల్
ఆరంభుండౌనో! పరము
జేర దలచునో! అదెల్ల జెప్పుము; చెలియా!

వచ. : ఈ విధముగా బహిర్గతుడైన పిమ్మట, అంతకు బూర్వము నందున్న జ్ఞానము కలిగి యుండునో లేక ప్రపంచ వ్యాపారములయం దాసక్తుడై యుండునో చెప్పుమో, భామా!

భామ, కందార్థము : భూ పతన మొంది నంతన
ఆపద గడచితి నటంచు నానందముతో
జ్ఞాపకము మరచి ఊధచే
వాపోవగ నంత తల్లి! వాత్సల్యమునను

స్తన్యపాన మిచ్చి ప్రోవగాను
పుచ్చుకొనుచు నంతా పూర్వ
జ్ఞానము మరచి మచ్చు జల్లిన రీతి
మాయ లోపల జిక్కి మచ్చికను
బాల్య యౌవన కౌమార వార్ధక్య దశ లవు డపు
డచ్చు పడ, మద కామ మోహ
మత్సర క్రోధ లోభముచే
హెచ్చు మెచ్చుగ నచ్చ
మను సంసార మందలి ॥ వాత్స ॥

వచ. : ఈవిధముగ వెలికి వచ్చుచునే 'అబ్బా! బాధ తప్పించుకొంటి' ననే సంతోషముతో మత్తులో పడినవానివలె పూర్వజ్ఞానమును కోల్పోయి ఆకలి వలన మాతృ స్తన్యమును గోరి బాల్య, యౌవన, కౌమార, వార్ధక్య దశలు కలవాడై కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యముల నొందుచు సంసారమునం దాసక్తిగలవాడై యుండును కదయ్యా, స్వామీ!

బాహ్మ : ఆ. వె. సకల ధర్మములను సంసారియై చేయ
దగునటండ్రు ; దాని దగిలి యుండ
గూడ దంటి ; వాని కొరగాని పను లేవి
గలవొ ? వాని వేగ దెలుప వలయు ॥

వచ. : పెద్ద లందరు బ్రాహ్మణుల కర్హమైన 'బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, యత్యాశ్రమము' లనెడి-ఈ నాలుగు ఆశ్రమములలోను మధ్యస్థమైన గృహస్థాశ్రమమే ఉత్తమమైన దనినారు. ఎందువలనంటే, బ్రహ్మచారి యత్యాదులను సపర్యలచే తృప్తిపరచుటకున్నూ, గురుకటాక్షపాత్రుడై తరించుటకున్నూ, స్వభార్య యందు ఇంద్రియ సుఖము లనుభవించుటకున్నూ, ఇత్యాదికములైన సకలధర్మములు సంసారియై చేయవచ్చునని

చెప్పుచున్నారు. అట్టి సంసారియై యుండుట తగదని నీవు పలికెదవు. ఇందు కోరగాని పను లేవియో చెప్పుమో లలనామణీ!

భామ: ఆ. వె. పరగ నీటిలోని పద్మపత్రము రీతి
బురద నుండు యెర్ర పుర్వు మాడ్కి
నుండవలయు గాక; నొక్క *పిసినికాయ
ప్రాణిరీతి నుండ పాడి యగునె?

వచ: సంసారమునందున్న మనుష్యు డెలా యుండవలె నంటే, ఉదకమం దుత్పన్నమై అచటనే యుండు తామరపాకు చందంబున, బురదలో తిరుగాడు 'యెర్ర' అను పురుగు విధమున ఆ జలమును, బురదను నంటక యుండవలయును. అట్లుగాక పిసినికాయ లోని పురుగు తనలోని దారముతో తనను బంధించు కొని అందులోనే నశించు విధముగా గృహస్థు డుండును. అటుల యుండుట కోరతగాదంటయ్యా, స్వామీ!

కం దుర్మద మనియెడి పొరచే
ధర్మం బను నడి గప్పి దారిని గనడా
మర్మము నెరుగక, ఆర్జిత
కర్మ యనెడి దైవతమ్మె కారణ మగుటన్॥

వచ: ఈ ప్రకారము దారా సుతాదికమైన సంసారము నందే భ్రమించుచు, దుర్మద మను పొర నేత్రమును గప్పగా, అంధుడై దారి నెరుగలేక, ఆ రహస్యమును ఆర్జితకర్మ, అను దేవత కారణము కాగా తెలియలేక సంచరించును కాదటయ్యా, స్వామీ!

కం. తరియైన తొలగి పోవును
మరు జన్మకు వచ్చు, మాటిమాటికి దాని
త్రెరగున దిరిగెడి వారల
నరయగ హెచ్చెవ్వరనుచు ననదగు చెపుమా!

* పిసినికాయ : పట్టుకాయ.

వచ. : ఇట్టులు ప్రవర్తించు చుండగా నింతలో నంతకాలము సమీపించును. అపుడు శరీరమును వదలి వేసి, మరియొక శరీరమున బ్రవేశించును. కాలచక్రము పగిది భ్రమణశీలుడై చచ్చుచుం బుట్టుచునుండువార లందరూ ఒక్కవిధము వారలే! కనుక మీ ఎక్కువ ఏలాగుననో, ఇతరులు తక్కువ ఏలాగుననో ఈ జను లెరుగునట్లు వివరింపవయ్యా, స్వామీ!

—ఇది పిండోత్పత్తి ప్రకరణము—

# ఆత్మ యజ్ఞము ప్రారంభము

## స్త్రీ పురుష సంవాదము

**దరువు - పరజు రాగము - ఆదితాళము**

భామ . 1. నెట్టన దేహధారులకు
పుట్టు వొకటే, మీర
లెట్టులా ఎక్కువ ? దాని
నెరిగింపుమయ్యా ॥ నెట్ట ॥

**వచ. :** ఈ దేహధారుల కందరకు పుట్టుట ఒకే విధము. కనుక మీ అధికృత ఏమో తెలుపుమయా, స్వామీ !

బ్రాహ్మ : 1. పుట్టువ యొకటయితే
భూమిలో నగ్రజన్ములని, మ
మ్మెట్టుల పూజింతురో ? వా
రెరుగకనో ! అకటా ! ॥ పుట్టు ॥

**వచ. :** మా కేవిధమగు నాధిక్యకత లేనట్టయితే ఎల్లవారు మమ్ము 'అగ్రజన్ములు' అని ఏల పూజింతురో చెప్పుమా, భామా !

భామ : 2. పట్టుగ వేషములు దాల్చి
బ్రాహ్మణుల మంచు దిరుగా
బట్టి, పూజింతు రది యెల్ల
వట్టిదె సుమ్మీ ॥ నెట్ట ॥

**వచ. :** కపట వేషములను ధరించి 'మేము బ్రాహ్మణులము' అని సంచరించుట వలన పూజింతురే కాని, అది అబద్ధమేనయ్యా, సామీ !

బ్రహ్మ : 2. అట్టిది అయితే బ్రిహ్మ, క్షత్రియ,
విట్శూద్రులందు నా మాట
వట్టిదొ, గట్టిదొ దాని
వివరింపవలయు ॥ పుట్టు ॥

వచ. : ఈ లోకములో 'బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర' అని నాలుగు వర్ణములు కలవని వాడుక గలదు అది నిజమో, అబద్ధమో చెప్పుము, భామా !

భామ : 3. అకటా ! ఈ కులములు తామై
అవతరించెనేమో కాని దాని
ప్రకటించి తెలుపుమయా !
కోపము సేయకు మయా ! ॥ నెట్ట ॥

వచ. : ఈ నాలుగు వర్ణములు నా చతుర్ముఖుని (ఆ బ్రహ్మ) సృష్టి లోనివియో, తామై పుట్టినవియో వివరింపుమయా !

బ్రహ్మ : 3. శుకవాణీ ! విశ్వరూపునకు
ముఖ బాహు వూరు-పాదమ్ము
లకు జన్మించె నీ నాలుగు
వర్ణమ్ము లనగ వినమె ॥ పుట్టు ॥

వచ. : ఆ విరాట్పురుషుని ముఖము నుండి, భుజముల నుండి, తొడల నుండి, పాదముల నుండి-ఈ నాలుగు అవయవముల నుండి ఆ నాలుగు వర్ణములు పుట్టెను కాని, ఇవిగాక వేరు వర్ణములను సృజించుటకు ఆ చతుర్ముఖునకైన అధికారము లేదు. కదవే తరుణీమణీ!

భామ : 4 ఒకనికి పదుగూరు జనన
మొందరటయ్యా ! వార
లకు నొకటే జాతిగాక,
నానావర్ణము లగునా ॥ నెట్ట ॥

వచ. : ఒక్కనికి పదుగురు సంతాన ముండును. అలా జన్మించినవారలకు ఏకకుల మగునో? అట్లుకాక అందరు నన్ని జాతులవారు నగుమరటయ్యా, స్వామీ!

బ్రాహ్మ : 4. ఒక టవునా? మోము-భుజములన
నొప్పునా? తొడ లంఘ్రులు నాల్గు
వేర్వేరౌగాక, చూడ
మొగ మడుగు కానా? ॥ పుట్టు ॥

వచ. : ఒకటే ఏలాగున నగునో? అలాగువ కావేరదు. ఎందువల్ల ననగా ముఖము, భుజములు, తొడలు, పాదములు-ఈ నాలుగు అవయవములలోను, ముఖముతో జేయు పనులు పాదముల తోను, పాదములతో జేయు పనులు ముఖముతోను చేయలేము కదా! కాబట్టి ఇవి యన్నియు నొకటని ఎలాగు చెప్పవచ్చునో, సరసిజాననా!

భామ : 5. బీజ మంకురించి గొప్ప
భూజమైతే, కొమ్మ చిగురులు
చూడ నొకటి కొకటి
వేరె జాతు లగునా ॥ చెట్ట ॥

వచ. : బీజ మొక్క టయినప్పంటికిన్ని బీజ వృక్షమునకు, కొమ్మలు మొదలగు వాట్లకు భేదము కలుగునటయ్యా, స్వామీ!

బ్రహ్మ : 6. బీజ మొకటయితే కొమ్మ,
పువ్వు, కాయలం దొక్కటి!
తాఁ జేయు పని మరియొకటి
తోఁ జేయనగునా? ॥ పుట్టు ॥

వచ. : చెట్టు ఒక్కటయినప్పంటికిన్ని మూలము, కొమ్మ, చిగురు, ఆకులు, పుష్పములు, పిందెలు, కాయలు, ఫలములు

మొదలయిన వాట్లకు, మూలముతో నయెడు పని కొమ్మలు, చిగురులు మున్నగు వాటితో కానేరదు కదా ! కాబట్టి అవి యన్నియు నొక్కటని ఏలాగున చెప్పవచ్చునో, భామా !

భామ 6. వ్యాపారములు గలుగు నప్పుడు
వాని భేదములే కాని
రూపింప తనకు తానైన
ఆరూఢున కది యెలా ? ॥ నెట్టు ॥

వచ॰ : వ్యాపారములు గలుగు నప్పుడు వాటి భేదాభేదములు లేక నిర్వ్యాపారుడు, పూర్ణుడు నైన ఆరూఢ జ్ఞానికి ఈ భేదములు కలుగునటయ్యా, బాపనయ్యా !

బ్రాహ్మ : 6. వ్యాపార శూన్యుడైనట్టి
వానికి నీ భూమి లోన
కాపురమై యుండుటకు
కారణమేమో ? చెలీ ॥ పుట్టు ॥

వచ॰ : ఓ కాంతామణీ ! సకల ప్రపంచ వ్యాపార శూన్యుడైనవాడు 'విదేహి' అనబడును. అట్టి దేహము లేని వానికి దేనితోను పని యుండదుకదా ! అటువంటి వాడు ఈ ప్రపంచమునందుండి కాపురముగలవాడగుటకు పని యేమి యున్నదో చెప్పుమా, భామా !

భామ : 7. కరణత్రయ మొకటి చేసి
పరుడైన శ్రీ కూచిపూడి దే
వరను దెలిసి యెల్లపనులు
జరుపా కొరత అగునా ! ॥ నెట్టు

వచ. : మనోవాక్కాయము లను త్రికరణముల కేకీభావము జేసి, పరమాత్ముని దెలిసినవాడై సకల కార్యములు చేయగా ఏమైనా కొరత అగునా, స్వామీ !

బ్రాహ్మ: 7. ఆత్మ నిశ్చయము కలిగి సకల
ప్రపంచ కార్యములను దెలిసి ॥
వాని యందు ఉదాసీనుడై లోకము
నందు నటించునంతవరకు
కుల గోత్ర తారతమ్యము
గలవాడై యుండక తప్పదె, తరుణీ ॥పుట్టు॥

భామ, వచ: అటులయిన 'బ్రాహ్మణు'లను పదము ఎవరికి వర్తించునయ్యా, స్వామి?

బ్రాహ్మ, వచ: జీవునకు వర్తించునే, భామా!

భామ వచ: జీవునకు బ్రహ్మత్వము కలుగనేరదయ్యా, బాపనయ్యా! ఎందువలన ననగా, జీవుడు అనేక జన్మల నెత్తుటచేత బ్రహ్మత్వ మాతనికి సిద్ధింపదయ్యా, స్వామి!

శ్లో. "మృత్పిండ మేకం బహు భాండ రూపమ్"

అన్నారు కదా! అంటే, శాలివాహనుడు మన్ను తొక్కి పదను జేసి, భాండములు తయారుచేయును కదా! కులాల చక్రము, వాటి కన్నింటికి కారణమను మన్ను ఒకటియే కదా! కార్య రూపము లను భాండము లనేకము లగుటిచేత అధిష్ఠాన మను మృజ్జన్య జ్ఞానమును కుండ లని, మూకుళ్ళు, బుడ్లు లని అనేక నామములతో వ్యవహరించుచుందురు. వాటి రూపంబు చెడినతోడనే మృత్తికయందే జేరునుకదా! ఇంకను, "సువర్ణ మేకం బహు భూషణాద్యం" అన్నారు. ఓ అయ్యవారూ! స్వర్ణకారుడు సువర్ణముతో ననేక ఆభరణములను చేయును కదా! వాని కన్నింటికి కారణము బంగార మొక్కటే కదా! కార్య రూపము లగు వస్తురూపము లనేకములై 'ఉంగరములు, గొలుసులు, గాజులు, ఉంగరములు, పోగులు చంద్రహారములు' నను నామంబులు వాడుచుందురుకదా, అయ్యవారూ! వాటి రూపము చెడుట తోడనే సువర్ణ మనబడునుకదా!

"గోక్షీర మేకం బహు వర్ణ ధేనుం" అన్నారు. గోవులు ఎర్రనివి, నల్లనివి, తెల్లనివి, పొడలు కలవి, అనేక చిహ్నములు కలవి యుండును కదా! వీటి అన్నిటినుండి వచ్చు క్షీరము లు ఒక్క రంగులోనే యుండునుకదా, అయ్యవారూ!

"శరీర భిన్నం పరమాత్మ మేకం" అన్నారు. శరీరములు తెల్లగను, నల్లగను, పొడవుగను, పొట్టిగను, అంగసౌష్ఠవము కలిగి అనేకవిధాలుగా యుంటాయి కదా! వీటి నన్నింటిని ప్రకాశింప జేయు 'ప్రత్యగాత్మ' యగు పరమాత్మ వాటికి కారణమగు చున్నది. ఆ పరమాత్మకు భేదము లేదు ఎందువల్లనంటే, సూర్యబింబానికి ప్రతిబింబం ఉదకమందు, అద్దములోను, కొన్ని నిర్మల వస్తువులందు నొకే విధముగ ప్రతిఫలిస్తూ యుండును కదా! అది చాండాల వాటికలోని బురదగుంటల నీటిలోను ప్రతిబింబిస్తుంది. అలాగే నిర్మలోదకములందు ప్రతిబింబిస్తుంది. కాని, మలినోదకములలో మలినముగాను, బంగరు బిందెలలో బంగరు రంగుగాను, మట్టి కుండలలో మట్టిగాను కనబడునటయ్యా, స్వామీ! వీని కన్నింటికి ఘట భేదం, స్థల భేదమే కాని ప్రతిబింబ భేదం లేదు. గాలికి జలం కదలినప్పుడు, ప్రతిబింబం కూడా కదులుతుంది. అంత మాత్రాన 'ప్రతిబింబమే కదలు తోంది' అనటం భ్రాంతి, కాబట్టి జీవునికి బ్రహ్మత్వము కలుగనేరదయా!

బ్రాహ్మ, వచ.: అట్లయినచో భామామణీ! ఈ శరీరము బ్రహ్మ నిర్మితము కదా! దీనికి బ్రహ్మత్వమేల యుండదు?

భామ, వచ.: మహానుభావా! శరీరమునకు బ్రహ్మత్వము లేదయా, స్వామీ! "అన్నమయాదన్నత్వం। అథవా చైత్య మేవ చేతనాత్" అను ప్రమాణమువలన ఈ శరీరమునకు బ్రహ్మత్వ మెలా కలుగునయా, స్వామీ! తల్లిదండ్రుల శరీరమువల్ల

కుమారునకు శరీరం సిద్ధించింది. ఇంతియకాదు. 'పృథివ్యాపస్తేజో వాయురాకాశము'లను పంచభూతములున్నాయని తెలియదటయ్యా? అవి ఈ స్థూల శరీరమునకు కారణములు. 'ప్రాణాఽపాన వ్యానోదానసమానవాయువు' లనే ప్రాణవాయువులున్నా; 'నాగ, కూర్మ, కృకర, ధనంజయ, దేవదత్తము' లనే ఉపవాయువు లున్నా; 'శ్రోత్ర, త్వక్, చక్షుర్జిహ్వా ఘ్రాణము'లను జ్ఞానేంద్రియ పంచకమున్నా; 'శబ్ద, రూప, స్పర్శ, రస, గంధము' లనే జ్ఞానేంద్రియ విషయములున్నా: ' వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థ'లను కర్మేంద్రియ పంచకమును; 'వచన, దాన, గమన, ఆనంద, విసర్జనము' లనే కర్మేంద్రియ విషయ పంచకము న్నా; 'మనో, బుద్ధి, చిత్త, అహంకారము'లనే మనశ్చతుష్టయములున్నా; 'కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యము' లను అరిషడ్వర్గమున్నా; 'రజ, స్సత్త్వ తమో గుణము'లనే త్రిగుణము లున్నా; వీటిచే సూక్ష్మ శరీరము. వీనిలో మనస్సుచే దశేంద్రియ ముల ద్వారా, త ద్విషయ వ్యాపారములతో మనస్సు చలింపచేయ బడుచున్నది కాదటయ్యా! సంకల్ప వికల్పములచే జీవుడు వ్యాపారపరుడగును కాదటయ్యా! వీటిలో శరీరమునకు 'బ్రహ్మత్వ' మనే గురుతు గాని, 'శూద్రత్వ'మనే గురుతుగాని ఎక్కడుందయా, సామీ!

బ్రహ్మ. వచ.: భామా! నీ మాటలు విన వేడుక కలుగు చున్నది. కనుక ఇపుడు శరీరము నందలి పంచ కోశములను వివరింపగదవే!

భామ. వచ.: అలాగుననే, స్వామీ! 'అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయము'లను పంచకోశము లీదేహమునకుండునయా!

> "పితృభుక్తాన్నజాద్వీర్యాజ్జాతోఽన్నేనైవ వర్ధంతే!
> దేహస్స్యన్నమయోనాత్మాప్రాక్చశ్చాత్తద భావతః."

వచ. : స్వామివారూ! తలిదండ్రులు భుజించిన యవ : వ్రీహ్యాది పదార్థములచే వీర్యము జనించుచున్నది. ఆ వీర్యము నుండి యుత్పన్నమైన దేహము, ఆ అన్నాదులచే వృద్ధిపొందు చున్నది. అట్టి స్థూలదేహమును అన్నమయ కోశము, అందురు. జననమునకు పూర్వమున్నూ, మరణమునకు తరువాతనున్నూ లేనిది యగుట వలన ఈ అన్నమయ కోశమగు శరీరము ఆత్మకాదు. దీనికి బ్రహ్మత్వమును కలుగ నేరదయా, స్వామీ !

బ్రహ్మ. వచ : బాగున్నది అటులయిన ప్రాణమయ కోశమును వివరింపుమా, భామా !

భామ. శ్లో. పూర్ణోదేహబలో యశ్చ, యత్ప్రాణాద్యః
ప్రవర్తతే !
వాయుః ప్రాణమయో నా సావనాత్మా పతస్య
వర్ధనాత్ !

వచ : ప్రాణమయ కోశమనగా-సమస్త శరీరమున-ఆపాద మస్తకము వ్యాన వాయువు వ్యాపించి యుండును ఈ వాయువు ప్రాణమయ కోశము, అనబడును. దీనికి జడత్వము కలదు. ఈ స్థితియే శరీరమునకు కలదు. కాన నిది బ్రహ్మత్వము కలది కాదయా, స్వామి !

బ్రహ్మ. వచ : లెస్సగా వచించితివి. మరిమనోమయకోశమో!

భామ. వచ : అయ్యవారూ ! మనోమయ కోశమునకు మాత్రము బ్రహ్మత్వమెక్కడిది ?

శ్లో. అహం మమేతి యం దేహః, దేహోదాచకరోతియః !
కామాద్యవస్థయా భ్రాంతో నా సావాత్మామనోమయః॥

ఈ శరీరము నాది, అను భావముతో ఇది నా ఇల్లు, వీరు నా వారలు అను కర్తృత్వము కలిగినది మనోమయకోశము. ఈ

అహం భావము శరీరధారులకు మనస్సు వలన కలుగుచున్నది. కాన దీనికిని బ్రహ్మత్వము సిద్ధింపదయా స్వామీ !

బ్రాహ్మ వచ. : ఆహా ! బ్రహ్మానందము కలిగినది. భామామణీ ! ఇక విజ్ఞానమయ కోశమును వివరింపుమా !

భామ. వచ. : దానికి మాత్రము బ్రహ్మత్వ మెచటిది ?

"లీనాసుప్తౌ వపుర్బోధే వ్యాప్నుయాదాన ఖాగగా ।
చిచ్ఛాయో పేత ధీర్నాత్మా విజ్ఞానమయ శబ్దభాక్ ॥

చిదాభాసముతో గూడిన బుద్ధి, సుషుప్తి యందులయించి జాగ్రదవస్థ యందు కొనగోటి పర్యంతము వ్యానవాయువుతో గూడి యుండును. ఇట్టి బుద్ధి 'విజ్ఞానమయ కోశము అనబడును. దీనికిని బ్రహ్మత్వ ముండదయా స్వామీ !

బ్రాహ్మ. వచ. : అటులయిన ఆనందమయ కోశము బ్రహ్మము కాదా !

భామ. వచ. : అదియును కాదయా, స్వామీ !

"కాచి దంతర్ముఖా వృత్తి రానంద ప్రతిబింబభాక్ ।
పుణ్యభాగే భోగశాంతౌ, నిద్రారూపేణ లీయతే ॥

బుద్ధి వృత్తి బాహ్యమును వదలి, అంతర్ముఖమై ఆత్మ స్వరూపమగు ఆనంద బింబమునకు ప్రతిబింబ మగుచున్నది. అట్టి వృత్తి. ఆనందమయ కోశము అనబడును. పుణ్య కర్మ భోగానంతరము ఇది నిద్రా రూపమున లీనమగుచున్నది. ఇదియు ఆత్మ ప్రతిబింబమే యగును. కనుక దీనికిని బ్రహ్మత్వము కలుగ నేరదయా స్వామీ !

బ్రాహ్మ వచ. : మేము జాతిచేత బ్రాహ్మణులమే. తరుణీమణీ !

భామ. వచ : జాతి మాత్రము చేత బ్రాహ్మణత్వము రాదు గదయ్యా! అట్లయిన స్వామీ!

మతంగ ఋషి పూర్వములో
మతంగ కన్యా గర్భమందు జనియించెన్ ।
ప్రీతితో తప మొనరించియు,
భూతలమున బ్రాహ్మణు డయ్యె బుధులు గణింపన్॥

శ్లో. "ఊర్వశీ గర్భ సంజాతో వశిష్ఠశ్చ మహామునిః ।
తపసా బ్రాహ్మణోఽభవత్కిం జాతి స్తత్ర కారణమ్॥"

వచ. : మతంగ మహాముని ఎవరయ్యా? మాదిగస్త్రీ గర్భము నుండి జన్మించినవాడుకదయ్యా! వశిష్ఠ మహర్షి ఎవరయ్యా స్వామీ? ఊర్వశి గర్భ సంభవుడు. అట్టివారు తపస్సు చేత బ్రాహ్మత్వము నొందిరికదయ్యా! జాతికిని, బ్రహ్మత్వము నకును సంబంధములేదయా!

బ్రాహ్మ, వచ. : అట్లయినచో నేనెందుచేత ఆధిక్యతను చాటుకొంటినో తెలియునా, భామామణీ।

భామ. వచ. : తమరు చెప్పబోవు విషయము నా మనంబున యోచింపగా ఒక్క శాస్త్రార్థవాక్యమును బట్టి చెప్పగలరని తోచు చున్నది. అదియు ద్విజత్వమునకు జెప్పబడును గాని బ్రాహ్మత్వము నకు జెప్పబడదయా, స్వామివారూ!

ఆ. వె : పూర్ణభావ మెరిగి పూజ్యులుగాక, మే
మెక్కువందు రందు కొక్కటుండె
న్యాయమొప్ప 'కర్మణా జాయతే ద్విజో,'
అనెడి శాస్త్రవాక్కు ననుసరించి ॥

వచ. : సకలము పరమాత్మ స్వరూపమే; కాని వేరె దారి లేదను భావము తెలిసి యుండియు, సర్వసమభావముగలవారలు గాక, కులభేదములు నిరూపించి, అన్ని కులములకంటె 'మేమే

ఎక్కువ' అనుట ఎందువల్లనంటే, 'కర్మణాజాయతే ద్విజః' అను శ్రుతి వాక్యార్థమువలన కాదంటయ్యా, స్వామి! ఆలాగునైనా, కర్మలు చేసి ద్విజు లయినారే గాని బ్రాహ్మణులు కాలేదు, కదయ్యా స్వామి!

కం. వేద విహిత కర్మలు న
త్యాదరమున జేయ నమలు లగుదురు మీరల్
మేదిని నక్కర్మల కగు
భేదములను దెల్పుమయ్య! పేరుల తోడన్ ॥

వచ.: వేదవిహిత కర్మలు చేయుట వలన మీరు లెక్కువ యగుదురు. సరియ కాని, మీరు చేయు కర్మల పేరు లేవియో, వాటిని చెప్పుమయా, స్వామి!

బ్రాహ్మ, ఆ. వె: పడతి! మేము చేయబరగు కర్మల పేరుల
నెల్ల మాకుఁ దెలియు నెంతమాట!
నీకు దెలిసెనేని నిక్కముగాఁ జెప్ప
గదవె; కంజనేత్రి! కమ్రగాత్రి.

వచ.: భామామణీ! మేము చేయు కర్మల పేర్లు మాకుఁ దెలియుటలో విశేషము లేదు. వాటిని మేము చెప్పుటయు విశేషము కాదు. కాబట్టి నీకు దెలిసినటు లయిన చెప్పుమా!

భామ. వచ.: తెలుపుదును, వినుమో, అయ్యావారూ!

సీ. యజన యాజనము లధ్యయన మధ్యాపక
దాన ప్రతిగ్రహణత్వమ్ము లనగ
భాసిల్లు, ప్రథమ గర్భాధాన సీమంత
పుంసవనాదులు పూర్తి జేసి
జాత నామకరణ చౌలోపనయనమ్ము
లటు మీదట వివాహ మాదికములు
బరగుచుండెడి శాంతి, పంచమహాయజ్ఞ
మివి మొదల్ కర్మల నెల్ల మీర.

ఆ. వె: లెప్పు డెద్ది సేయ నెట్టులో ? మీకును
నర్హమగునో ? అప్పు డద్ది సేయ
వేదమంత్ర విహిత విధిచోదితంబుగ
చేయుటకును మీకుఁ జెల్లుగాక !

వచ.: యజన యాజనాది షట్కర్మలున్నూ, ఇవిగాక గర్భాధాన, సీమంత, పుంసవన, జాత కర్మాది షోడశ కర్మలున్నూ, ఆ యా సమయములందు విధి విహితముగ జేయుట మీవలననే గాని, ఇతరులకు అర్హతలేదు కాదటయ్యా, స్వామీ !

బ్రాహ్మ: ఆ. వె: ధరణిలోన బుట్టు తనువు లన్నిటి లోన
నొక్క టంటి విప్ర డోలతాంగ !
కర్మచే ద్విజన్మ కలిగె మీ కని చెప్పి,
తదియె, యెక్కువనగ తగదె? మగువ:

వచ.: భామామణీ ! ఈ భూమిలో బుట్టిన మానవు లందరూ ఒక్కటే ! అని చెప్పి, ఇపుడు కర్మచే మమ్ము ద్విజన్ములనుగా జెప్పితివి. అది మా ఆధిక్యత కాదా ?

భామ: దర్వు - చతురశ్రత్రిపుట - రేగు ప్తిరాగం
ఇంతలోనే మీరెంతటి ఘనులు-గ
ర్వింతురు; తెలుపుమయా, సదయా ! ॥ ఇం ॥
వంత మేల రవ్వంత సేపు నిలు
డంతయు నే వివరించెద, నా దెలిసి
నంత ; ఇపుడె వినిపింతు నదియు, విని
నంతలోనె మీ భ్రాంతి తొలగుగద ॥ ఇం ॥

వచ: కర్మచే మీరు ద్విజులై రన్నంత మాత్రమున గర్వించ వచ్చునటయ్యా, స్వామీ ! అయినను, కొంచెము తాళుడు. క్రమముగా మేమే అధికులమనెడి భ్రమ తొలగు నటుల చెప్పు దునయా, స్వామీ !

బ్రాహ్మ: అంతే చాలు నో కాంతామణి ! ఓ
చింతామణి ! కదల నిక వదల ॥ నంతే ॥
ఇంత యేల నిక కొంత తడవుకు వచి
యింతు ననుట వింతా ! చల్లకు వచ్చి
ముంత దాచు టెంతా ! కార్యమొ; ఇది
అంతే సుమ్మి ! రంత సేయదగ దిసుమంత ॥ అం

వచ.: భామరో ! కర్మ శ్రేష్ఠులున్నూ, ఆ కర్మల చేత మీరు ద్విజన్ములున్నూ అయితి రంటివి. మా బ్రాహ్మణులు అల్ప సంతోషులు కదా ! కనుక మేము అంత మాత్రమున కే సంతోషింతము గదవే ! తరుణీమణీ ! - ఇంక కొంత సేపు తాళుడు - ఆవలఁ జెప్పెదనుట కార్యమా ! ఆ ప్రశ్నకు ఆ యుత్తరువు. కనుక ఈ ప్రశ్నకు ఇపుడుత్తరువు జెప్పననుట ఎట్లు పొసగును ? చల్లకువచ్చి ముంత దాచుకొనుట కార్యమా ! అయినను చెప్పుము, భామా !

భామ, 2. ఘనతరమగు శ్రుతిజనితములయి న
త్యనుకూలము లయిన కర్మల
ననుదినమును జేసిన కతన నవల
మునుకొని వేదములను పఠియించుచు
తన యధికారము దనరజదివి, య
న్యులకు జెప్పుట జనుము మీకు నని ॥ ఇంత ॥

వచ.: అయ్యవారూ ! మిక్కిలి ప్రియములై, అధికములై వేదజన్యములయిన కర్మలను, తత్తన్మంత్రయుక్తములుగ జేయుట వలన వేదము జదివే యధికారమును, అన్యులకు జెప్పే అధికారమును మీకు గలిగినది. కాదంటయ్యా, స్వామీ !

బ్రాహ్మ, 2. వనజా యతలోచన ! నీ విప్పుడా
డిన మాటయె చాలు ! మిక్కిలి
ఘనమది ఎన్నటికి తొలుతనె, బు
ట్టెను; బ్రహ్మము తాననదగు వేదము
లను పఠియింపను, నీ జనులందరకును
జన దధికారము, అని పలికితి విప్రు ॥ డంతే ॥

వచ. : వేదవిహితము లయిన కర్మలను జేయుటచేత నా వేదములను జదివేటందులకున్నూ, ఇతరులకు జెప్పుటకున్నూ మాకే అధికారము గలదని నీ విప్పు డంటివి. ఆ వేదము బ్రహ్మ స్వరూపమున్నూ, అనాదియున్నూ అగును కదా! నీవున్నూ అట్టి వేదము - మీకేగాని ఇతరులకు జదువ నధికారము లేదంటివి. అందువలన 'మేమే ఎక్కువ' అని నీవే చెప్పుచుంటివి కదా, తరుణీమణీ !

భామ : జన్మచేతను, ఘన కర్మచేత
వేదమ్ము చదివినందు వలన - ద్వి।
జన్మయు విప్రత్వమ్మెకాని, స
ద్బ్రహ్మ మేమాత్రము దగదు।
సు మ్మీ ! మాట నిజమ్ముగ
నమ్ము, మిహమ్మున కీ నా
మమ్ములె కాని, పరమ్ము
జేయదగ వింతలోనె ॥ ఇంత ॥

వచ. : జన్మచేత శూద్రులున్నూ, కర్మచేత ద్విజులున్నూ, వేదాభ్యాసము చేత విప్రులున్నూ అయితిమని మురిసెద రింతేగాని, అక్కటికిని గూడ బ్రహ్మత్వము రాలేదయ్యా, అయ్యవారు ! అయినా, ఈ నామములు ఇహమందు ప్రతిష్ఠ నిచ్చునే గాని, పరమున నిష్ప్రయోజనములు కదా !

బ్రాహ్మ : జన్మ యొక్కటని చెప్పితి; నీ వా
దమ్ము గెలువ దనుచు తోడనె।
కర్మల జేసి ద్విజన్ములై-వే
దమ్ముల నభ్యాసమ్ము జేసి, భువ
నమ్ముల విప్రత్వము గంటిమని
కొమ్మరో ! నీవే ము
దమ్మున బలికితి ॥ వంతే ॥

వచ. : తొలుత జన్మచేత శూద్రు'లని చెప్పి, ఆ వాదము స్థిరపరచుకొన జాలక, వెంటవే కర్మలను జేసి ద్విజులై, ఆ కర్మ ఫలముచేత వేదములను జదివినందువలన విప్రు లైనా రంటివి. ఇందులో మొదట జెప్పిన శూద్రత్వ మొక్కటే మీ యందున్నది. మీకంటె ద్విజత్వ, విప్రత్వములు మాకు గలవనుటచేత, మీ కంటె మేము ఎక్కువని నీకే తెలియుచున్నది కదా!

భామ : ఓడితివని వాదాడుచు, జేతులు
ఝాడించుచు, బైపడి రా।
కూడ దనుచు మోమోడక, ఇది యొక
చేడె అని చులకనగా
జూడకు ; మిది నాతోడ వాదమును
కూడదు సుమీ! ని
న్నీడ నెల్లరు జూడ గెలుతు ॥ సంత ॥

వచ. : ఓడిపోయితి వని చేతులు జాపుకొనుచు, మూతులు పొడచుచు మీది మీదికి వచ్చెదవు. ఆడుదానినని చూచితివో, వెనుతియ్యక, ఈ క్షణమందు నిచటనున్నవార లందరు చూచు చుండగా నీ వాదమును పూర్వపక్షము జేసి, నా వాదమును సిద్ధాంతము జేసెద జూడమయా!

బ్రాహ్మ : చేడె! తెలిసె; నీ కోడెద నని
యేడకైన బరుగిడి కొందర
బాడబులను జతగూడు డని బ్రతిమ
లాడియైన తోడితెత్తు.
పోడిమి చదువుల నేడ నేర్చితివో!
ఓడెదనే! ఈడ నీ కహహ ॥ అంతే ॥

వచ. : నీకు ఓడిపోవుదునేమో అను భయమున నెచ్చటికైన బోయి, అక్కడ బాగుగ జదువుకొనిన బ్రాహ్మణులను సహాయము గూర్చుకొనివచ్చియైనా వాదింతునా? అబ్బబ్బా! భయమగు చున్నదికదా! అయినా, నీ బుద్ధి కుశలత కొలది నీ వంటివి. మా బుద్ధి కుశలత, విద్యా చాతుర్యముల నీ వెరుంగవు. అయినను, వాదించి గెలువుమా, పూబోడీ!

భామ : చెల్లవో? బ్రాహ్మణ జను లనగా
తెల్లతెల్లగ కొందరను ఎర్రగ,
నల్లనివారో? ఒడళ్లు పచ్చగ శో
భిల్లుదురో? మే నెల్ల విభూతిని
కొల్లగ భూతురొ? తెల్లని నామము
లెల్ల ధరింతురొ? బల్లిదులో. తెల్పు మిది ॥ఇంత॥

వచ. : స్వామీ! నే నొక్కటి యడిగెదనుగాని యుత్తరువు చెప్పుమయ్యా, పండితోత్తమా! బ్రాహ్మణు లనగా తెల్లనివారో, ఎర్రనివారో, నల్లనివారో? కంటె కడియాలు ధరించువారో? ఉంగరములు, పోగులు, మురుగులు మున్నగు ఆభరణములు ధరించువారో, శరీర మంతటా విభూతి, రుద్రాక్షలు ధరించువారో, మంచి మంచి వస్త్రములు ధరించు నటువంటివారో— వీ రందరిలో ఎవరో చెప్పుమయ్యా, స్వామీ!

బ్రాహ్మ : పల్లవపాణిరో! బ్రాహ్మణులలో తెల్లా
తెల్లగ కొందరూ, ఎర్రని
నల్లనివారూ, ఒడళ్లు పచ్చగ శో
భిల్లుదురూ, మేనెల్ల భూతి దాల్చి భా
సిల్లుదురూ. మొల నూ ళ్లుంగరాలు
నెల్ల ధరింతురూ, కల్లరులటె ॥ నీవంతె ॥

వచ. : ఓ పల్లవపాణీ! మా బ్రాహ్మణులలో కొందరు ఎఱ్ఱగను; కొంతమంది నల్లగను; మరికొందరు పచ్చగను; మురుగులు, ఉంగరాలు, పోగులు మున్నగు ఆభరణములు ధరించి శరీరములు దృఢముగా గలిగియు నానావిధములగ నుందురు. అలా ఉండువా రందరూ బ్రాహ్మణులు కారా, సుందరీమణీ!

భామ : మీ చందంబులు వాచకమందలి
ప్రాచుర్యములే లెన్నగా,
జూచితే కలహమె చేసెదరని మది।
దోచె నైనా తెరచి బ్రాహ్మణుల నే
జెప్పెద, జగదీశుడైన శ్రీ
కూచిపూడి రామేశు దలచుకొని ॥ ఇంత ॥

వచ. : మీ త్వరపాటు, మీ మాటు మదుగు జూడగా కలహాంతురనె తోచుచున్నది. అయినప్పటికి, నా ఇష్టదైవమగు శ్రీ కూచిపూడి రామలింగేశ్వరుని దలచి బ్రాహ్మణులనగా నెట్టివారో తెలిపెదను, వినుమయ్యా!

బ్రాహ్మ : ఓ జలజాయతలోచన! మేల్ భళీ నీ
చతురతకొలది బ్రాహ్మణు।
లే చందంబున భాసిలుదురో, సం
కోచమేల? సభ జూచి పలుకగ।
కూచిపూడి పురవాసు డొసంగిన
నా చమత్కృతులు చూచెదగా కిసు ॥ మంతే ॥

వచ. : నీ చాతుర్యము కొలది ఈ సభాసదులను జూచి వెరవక, బ్రాహ్మణులనగా ఎట్టివారో చెప్పుమా, భామా! నా ఇష్ట దైవమును ప్రార్థించి వాని యనుగ్రహమువలన బడసిన వాక్చాతుర్యమున ప్రత్యుత్తరమును జెప్పెద చూడుమా, లలనా తిలకమా!

భామ : కం. ఈ సర్వజనులు ప్రచురము
జేసిరి శ్రుతి పలుకు దాని జెప్పెద వేదా
భ్యాసేన విప్రత్వం' బని
భాసురముగ బల్కి రింతె, బ్రాహ్మణుల నిరా
నిర్గుణ పరబ్రహ్మముఁ గనిరా ?
కర్మలు చేసి స్వర్గమ్మున గలుగు
భోగమ్ములు గని, మరల
జన్మింతురు ఇపుడు కా
మ మ్మెనగు స్వర్గమ్ము పరమని
నమ్మి చెడుట నిజ మ్మనగ ॥సద్బ్రాహ్మణులనిరా॥

వచ. : స్వామీ! ఈ లోకములో నందరు నొక ధర్మ శాస్త్ర వాక్యమును వాడుచున్నారు. అది ఏమనగా. "వేదాభ్యాసేన విప్రత్వం" అని ఆ వాక్యమును ప్రమాణముగా జేసికొని వేదముల నభ్యసించినందు వలన విప్రులైనారని చెప్పినారే కాని, బ్రాహ్మణులైనా రని చెప్పలేదయా, స్వామీ! వేద విహితము లయిన కర్మలు చేసినందు వలన కలుగు స్వర్గాది లోకము లందలి భోగముల ననుభవించి, ఆ స్వర్గ భోగములే పరమని నమ్మినవారలై కొంతకాలమునకు క్షీణ పుణ్యులై పునర్జన్మ నంది చెడుదురు అని చెప్పినారు కాదయ్యా, స్వామీ!

బ్రాహ్మ : కం. కర్మ జ్ఞానము లోకటని
ధర్మవిధులు తెలుపుచుండ, దగదనియెదవా ?
మర్మంబు తెలియలే కది
దుర్మదమని పలుకుటెటులో ? తోచెను జెపుమా !
సకల పాప మోచన మనుమా !
యోచింపగ శాస్త్ర వాసన
నీకు లేదు సుమీ! యని నా మది
దోచె, జ్ఞాన కర్మలీ చతురులగు పెద్ద లోకటిగ

చూచెదరు, కించిజ్ఞు లవి వేరుగ చేసెదరు
గాక, నీ శాస్త్ర సు వాచకము లెరుగ కిటు బలుకగ
దోచెనో ? చెపుమా !

వచ. : తరుణీమణీ ! కర్మ, జ్ఞానము లొకటేనని శాస్త్రములు తెలిసిన పెద్దలు చెప్పుచున్నారు. ఆ రహస్యము నీకు దెలియదని తోచుచున్నది. ఎందువలన ననగా జ్ఞాన, కర్మల రెంటికి నొకటే మార్గమని చెప్పగా, నది తెలియక నీవు వేరుగ వాదించెదవు. నీకు శాస్త్ర పరిజ్ఞానము లేదని ఇందుమూలమున దెలియుచున్నది.

భామ : వచ. : శాస్త్రములందు బ్రాహ్మణుల చర్య లేమని చెప్పిరో వివరించెదను, వినుమయా, స్వామీ !

కం. పరువిడి మానవ జన్మము
దొరకుట దుర్లభము నదియ దొరకినయెడ స
ద్గురు బోధ వడసి తా నె
వ్వరో ? తను దా దెలిసి మెలగువారే బ్రాహ్మణులు.
మరి తిరిగి భువి,
జేర రా ఘనులు, ఆరూఢులయి ము క్తి
ద్వారము దెరచి మూ డేరులకును మధ్య
జేరి ఆనందించు వారే బ్రాహ్మణులు ॥

వచ. : సకల జన్మలలోను మానవ జన్మము దొరకుట దుర్లభము. అట్టి మానుష జన్మ దొరకిన యెడల మంచి గురువును సంపాదించుకొని, త్రివేణీ సాగర సంగమ స్థలమందు ప్రవేశించి, ఆనందము నొందుచున్న వారే బ్రాహ్మణులయా !

బ్రాహ్మ : కం. ఆరూఢులు, ఆరు రుక్షులు
జేరెద రొకచోట, వారి జెప్పగ నేలా
మీరిన కర్మచయంబుల

పారంబుగ జేయుచున్నవారే బ్రాహ్మణులు
బ్రహ్మమందు,
జేరెదరు, - బలె- తారుణ్య విద్యా
భూరి ధనాది గర్వారంభులను గాక
కూరిమితో నుండువారే బ్రాహ్మణులు.

వచ. ఆరురుక్షులు, ఆరూఢులు నను వారు కలరు. ఆరూఢు లనగా జ్ఞానమును లెస్సగా నెరిగినవారు. ఆరురుక్షు లనగా, జ్ఞానము నెరుగుచున్నవారు. ఈ యుభయులు నొకే స్థానమును జేర గలరు. ఇట్టి జ్ఞానము కలుగుటకు కారణము 'కర్మ' అని కొన్ని గ్రంథములందు జెప్పబడినది. దీనిని గూర్చి తరువాత వివరింతును. కాని, కర్మ జేయువాడు కుల, విద్యా ధనాదుల వలన గర్వము నొందక, ఈశ్వరార్పణ బుద్ధితో నా కర్మల నాచరించి నందువలన చిత్తశుద్ధియును, ఈ చిత్తశుద్ధి వలన సాధన చతుష్టయ సంపత్తియు గలిగి, 'ముక్తుం' డగునని శాస్త్రములు చెప్పుచున్నవి కదా, భామా !

భామ : కం. సారెకు మూడు గుణంబులు
పార దరిమి యొక్కచోట పద్మాసనుడై
ధారణచే విషయేంద్రియ
వారమును జయించి మించువారే బ్రాహ్మణులు
మరి తిరిగి భూమి
జేర రా ఘనులు, వారు నేమనుచు, వే
ర్వేరు జూడక సర్వాధారుడైన విభు
జేరి యానందించువారే బ్రాహ్మణులు.

వచ. : గుణత్రయంబు నొందక, ఒక విజన స్థలంబునందు ప్రవేశించి పద్మాసనాసీనుండై, ధారణాయోగ మవలంబించి విషయేంద్రియములను జయించి, "పరులు-నేను" అను భేద బుద్ధిని విడచి, సర్వము బ్రహ్మమయముగా భావించువారే బ్రాహ్మణులు కాదటయ్యా, అయ్యవారూ !

బ్రాహ్మ : కం. ధారణ యోగియును, నిరా
హారియు, నై దింద్రియముల నణచిన నభిలా
షారూఢి మాన నేరదు.
ధీరులు నిష్కామకర్మ దెలియరె ? కొరతా ?
కూడదంటి నీవు ఓ వనితా !

వీర లందరిలో నెవ్వారి మదిలో నేమి
కోరి కున్నదో దెల నేరయకంటివి, కర్మ
జేరుట కొరతా ॥ దెలి ॥

వచ. : ధారణ యోగియు, నాహార శూన్యుడునై ఇంద్రియము లను శోషింప జేసిన మాత్రమున నభిలాషములు నశింపవు కదా! కాన అభిలాషములు లేక అనగా నిష్కామకర్మ జేయుట వలన నేమియు కొరత యుండదు. ఈ యున్నవారిలో నెవ్వరి మనసు నిష్కామమో, ఎవరి మనసు సకామమో తెలియక యంటివిక దే, భామామణీ !

భామ : కం. విను, కర్మ ఫలము తన కొల
దనుచును నని జేయు దనకు దప్పునె! వినుమా
పనివడి బీజము పాదున
మును బెట్టి నది వలదన్న మొలవక యున్నే
దాని గుణము మానకున్నే ।
పలుమారు మీరు వాక్ప్రౌఢిమ చేత, న
న్న లయించెదరు గాక ।
పలుకు మిందుకు ప్రతి ॥మొల ॥

వచ. : అయ్యవారూ! సకల కర్మలను ఫలాపేక్ష లేక నిష్కామ బుద్ధితో జేయదగు నంటిరి కదా! కర్మలకు ఫలముల నివ్వడము సహజము. ఆ ఫలములు తమకు అక్కరలే దనినంత మాత్రమున నే మగును ? బీజములకు మొలచుట

ఎలా, స్వాభావికమో కర్మలకు ఫలముల నిచ్చుటయు నట్లే స్వాభావికము. అట్టి బీజములను మొలువవలదని భూమిలో స్థాపనము చేసినచో మొలువక మానవుగదా! అలాగుననే ఫలముల నపేక్షింపక కర్మ జేయగా వాటి ఫలముల నీయక మానునటయ్యా, స్వామీ!

బ్రాహ్మ, కం. : వలదని చేసిన కర్మలు
ఫలమీయక మానవనుచు బలికితివి గదా।
మొలచుట ధర్మము బీజ
మ్ముల కంటివి నీవు దాని మూల మెరుగక
వాదించెదవే చెదరకన్.

బాల! నిష్కామాగ్ని జ్వాలలచే ఫల
మూలములగు కర్మ జాలము లనెడి బీ
జాళి వెచ్చగ జేసి చల్లిన
మేలి ఫలములైన మొలచునే
చాలునటే బేలవై ఇటుల ॥ మూల ॥

వచ. : బీజములకు మొలచుట ధర్మము కదా! అట్టి బీజములను మొలువ వలదని భూమిలో స్థాపన జేయగా మొలవక మానునా, అంటివి. కర్మలకును, బీజములకును పోలిక దెచ్చితివి, బాగున్నది. ఆ కర్మలను, బీజములను, నిష్కామమను నగ్నిచేత తప్తము జేయగా 'ఫలములు' అను మొలకలు రాజాలవుకదా! అలా చేసిన పక్షమున కర్మలు తమ స్వాభావిక ఫలముల ననుభవింప జేయగలవా, భామామణీ!

భామ : శార్దూలార్ధము – ముఖారి రాగము
తప్తోద్బీజ కదంభతాపన క్రియా
తాత్పర్యులౌ మర్త్యు లీ
సప్తద్వీపములందు జూడ గలరే!
సత్కర్మలన్ తత్ఫల

ప్రాప్తిం గోరక చేయుచే! ఇతి వృథా
ప్రాగల్భ్యములేగక; తా
దృష్టిఁ జెందక కర్మ మానిన తరిన్
దోషాప కృష్టుండ నౌ, ననియే పెద్దలైన
దూషించి పల్కిరా? - వాని
ఈషణత్రయ జనిత మహోద్భుత
దోషరూపులై దుగు రాగ
ద్వేష లజ్జా మోహ భయమ్ముల
పోషణ మొందించియును మది నభి
లాష లుడిగి తను దా
భాషించుట యుడిగి, యన్యులు
దూషించిన విని, రోషింప కుదర
పోషణ మాత్రము నాశించును; వి
శేషజ్ఞుడు మితభాషియు నగుచు, న
శేష కర్మల నిషేధించిన యెడ ॥ దోష ॥

వచ: ఏ లోకమునందయినను, ఎంత వెర్రివాడయినను, వేదన విత్తనములను స్థాపనము జేసి వృథాయాశ పడుదురటయ్యా, స్వామీ! అటువలెనే, ఫలముల నపేక్షింపక, నిష్ఫలము లయిన కర్మలు సేయక మానిన యెడల దోషము కలదా! రాగ ద్వేష లజ్జా మోహ భయములనున్నూ, అభిలాషముల నున్నూ, ఈషణత్రయముల వలన పుట్టిన దోషరూపములగు దుర్గుణములనున్నూ వర్జించి దూషణ భూషణ తిరస్కారములందు సముడై, ఆత్మస్తుతి, పరనింద లేక యున్నవాడు కర్మలు చేయక మానిన యెడల దోషము కలదటయ్యా, స్వామీ!

ప్రాహ్మ: : శార్దూలార్ధము : - ముఖారి రాగము

దివ్యజ్ఞానియునైన, కర్మలను దా
　　　　దీర్పింపగా జేయ గ
ర్తవ్యంబౌ; జగదావనోత్సుకత
　　　　తాత్పర్యాత్మ సంవేదికిన్,
అవ్యక్తుండు కులాశ్రమోచితము
　　　　లత్యంతం బనుష్ఠింపమిన్
భావ్యుండై నఘంబు బొందును గదా!
　　　　పాయంగ నేరండె

అని వేదాంత శాస్త్రాధ్యాపకుల్ తెల్పరే। వాని
　　　　నెయ్యమున బండితులే సలుపని,
　　　　చయ్యోనేని కర్మల నియ్యెడ
　　　　చయ్యన తజ్జ్ఞుండు భయత్రస్తు
　　　　డయ్యె, నందుకు మూలంబెవ్వ
　　　　డయ్యె; చెప్పుమా! ఉపమా! పాపము
ద్రోయ తరమె? భరమా! గాక, స్వ
కీయ కర్మలతి విహ్యములైనను,
జేయ వలయు, పరకీయ కర్మల
నియ్యెడ సల్పిన నయ్యవి పరసుఖ
మియ్య నేర వికవెయ్యేలా?" నఘముబాయు॥

వచ. స్వస్వరూప జ్ఞానము కల పండితులైనను, 'నేను జ్ఞానము కలవాడను' అని కర్మలను నిందించ గూడదు. తాను కర్మల నాచరించుచు నితరులచేత నాచరింప జేయువలయును. లోకరక్షణ యందు తత్పరతగల తత్త్వజ్ఞునకు ఇది ధర్మమగును కదా! ఇంక నజ్ఞుడు కర్మ బీజముల నెరుగనివాడై స్వకుల, ఆశ్రమోచిత కర్మలయం దాసక్తి కలవాడై, తనకు దెలిసినంత వరకు కర్మల నాచరించుచున్న వానిని జూచి, 'నేను పండితుడను' అను అతిశయము కలవాడై, వాటిని బరీక్షించి, ఆ కర్మలను నిందించి 'ఇట్లు చేయవలదు'-అని మాన్పించి నట్లయితే పూజ్యుడైన వానికిన్ని పాపము రాక మానదు, అని ఈజ్ఞాన శాస్త్రము నెరిగిన వారు భగవద్గీత యందు జెప్పి యున్నదని వక్కాణించుచున్నారు.

'నేను పండితుడను' అని కర్మలు చేయక మానిన యెడల, ఇతరుడైన అజ్ఞాడున్నూ, 'పండితునిచే విడువబడిన కర్మలను నేను మాత్రము చేయుటందువలన లోపమేమి ?' అని కర్మత్యాగియై జ్ఞానము నెరుగక, జ్ఞాన కర్మల రెండిటికి భ్రష్టుడగును. అట్లాతడు చెడి పోవుటకు కారణము పండితుడగుచున్నాడు కదా, భామామణీ! అదియునుగాక, స్మృతుల కర్మలు యోగ్యములయిన వైనను అవి పర సుఖము నీయజాలవు కదా! కనుక, వేయి పర్యాయములు చెప్పుచునిరేను. కనుక కర్మల పరిత్యాగములు కానేరవు కదా, భామారత్నమా !

భామ : మత్తేభ విక్రీడితము - పంచపాది.

అపవర్గ ప్రదమవ్యయంబునది
ఆద్యంతంబు శూన్యం బజం
బపరిచ్ఛేద్యము, హాని వృద్ధి రహితం
బత్యున్నతం బ్రమే
యపదంబైనదగు స్వస్వరూప నిజ
*విజ్ఞానంబుతో సామ్యమే
యుపమున్ జెప్పెద, కర్మ చూడ పునరా
వృత్తంబు, సంపత్ప్రదం
బపరాధాత్మక మర్థ సాధ్యమటువీ
మార్గంబుతో కర్మలన్

వచ. : స్వామివారూ ! మోక్షప్రదమైనటువంటిదిన్నీ, ఎన్నటికినీ తిరుగులే నటువంటిదిన్నీ, ఒక్కటియై నటువంటిదిన్నీ, మొదలు తుది లేనిదిన్నీ యగు దానిని స్వస్వరూప జ్ఞానముతో కర్మ సమానముగ జెప్పుచున్నారు. ఆ కర్మ పునర్జన్మ హేతువును, సంపదల నిచ్చునదిన్నీ, మంత్రక్రియాదుల దోషపరిహారార్థము, ప్రాయశ్చిత్తాదులు కలదిన్నీ; ద్రవ్యమధికముగ వ్యయము జేయుటచే

---

*యతిభంగము కాన విజ్ఞానవృద్ధి యనవచ్చును.

గాని సాధింపరానిదిన్ని, అరణ్యమార్గము వంటిదిన్ని యగు కర్మను జ్ఞానముతో సమానముగ జెప్పవచ్చునటయ్యా, అయ్యవారూ!

బ్రాహ్మ: మత్తేభ విక్రీడితము - పంచపాది.

నెపముల్ బల్కెద వీశ్వరార్పణముగా
నే కర్మలం జేసినన్
అపరాధంబును లేక యర్థమును
దా నార్జించుచున్ జన్మలన్
చలత్వంబున గాక, నిర్మలములై
సల్పం దరణ్యా కృతిన్
జపహోమ క్రియలన్ స్వశక్తి కొలదిన్
సల్పంగ నా కర్మలున్
విపరీతంబులు గాక నిర్మలములై
విజ్ఞాన హేతుల్ కదా।

వచ.: భామా! తప్పుగా బలుకుచున్నావు. భగవదర్పణముగా జేసిన కర్మలు, మంత్రక్రియాది లోపముల వలన నయ్యెడి ప్రాయశ్చిత్తంబుల నొందక ద్రవ్యము, సత్కర్మలు చేయువారు, లోకుల వలన తా మార్జించునదియై, ఈశ్వరార్పణముగా జేయు కర్మలు జన్మ కాదియును గాక, గహనము వలె గొప్పగా నుండును. ఇట్టి కర్మలు జప హోమ క్రియల యందు దన కలవియైనంత వరకు జేయ వచ్చును. ఆ కర్మ నంతయు జేయలేనందు వలన, జేసిన యంతయే యభ్రకమ నాశము లేక యుండు పరిశుద్ధ కర్మలు జ్ఞాన హేతువులని శాస్త్రములు ఘోషించు చున్నవి కదా, భామా!

భామ, కంద.: జ్ఞానము తోడుత కర్మకు స
మానం బా రెంటి కొకటే మార్గంబనుటే
కాని; యొక దారియే యుప
మానముతో నగును? దాని మానక చెపుమా!

వచ. : జ్ఞాన కర్మలు రెండు సమాన మనిన్నీ, ఆ రెండిటికి దారి యొకటే అనిన్నీ చెప్పుచున్నారు. కాని, ఏయుపమచేత సమానమో చెప్పుడయ్యా!

బ్రాహ్మ, కంద. : సూనము పండకు హేతువు
తానై పక్వతను జెందు తరి లయించున్
మానుగ కర్మయు పెప్య
జ్ఞానము నొనరించి తాను గనుపడ కుండున్.

వచ. : పండు గావటమునకు పుష్పము కారణ మగును. పండు పండు వరకు క్రమక్రమముగ నా పుష్పము ఏలాగు నశించునో జ్ఞానము కలుగునంత వరకు కర్మ కారణమై, జ్ఞాన మభివృద్ధియైన పిదప, కర్మ తనకు దానై నశించును కాదా, తరుణీమణీ?

భామ, ఆ. వె. : అట్టివైన కర్మ లపరి హరము లౌను.
గాని, కర్మలందు ఘనత నొందు
నిర్మలంబు నందు నీశ్వర రూపెద్ది
గలదొ - దాని బాగ దెలియ వలయు

వచ. : కర్మచేత జ్ఞానము కలుగు నంటిరి కదయ్యా! అయ్యవారూ! అలాగైతే కర్మలు పరిత్యాజ్యములు కావు. కాని, ఆ కర్మలలో నధికములై, పరిశుద్ధములై, భగవద్రూపములైన వేవియో వివరింపుమయ్యా, స్వామీ!

బ్రాహ్మ, ఆ. వె : వినుము; కర్మలెల్ల వేదమందు జనించె
నక్షరమున వేద మమర బుట్టె;
నదియు గారణమున నంబుజాక్షుడు యజ్ఞ
రూపు డనగ మించు రూఢి గాంచు ॥

వచ. : సకల కర్మలు వేదము నుండి యుద్భవించినవి. ఆ వేదము అక్షరము నుండి జన్మించినది. అది కారణముగ సర్వ వ్యాపకుడైన పరబ్రహ్మము యజ్ఞరూపుడని పెద్దలు చెప్పు చున్నారు కదా, తరుమణీమణీ! కాబట్టి యజ్ఞము పరమేశ్వర స్వరూపము కాదా!

భామ : దర్వు - రూపకతాళము - శంకరాభరణము

ఇటు లౌనంగ తగవగునా?
ఈ సభలో నిందరు వినంగ ॥ ఇటు॥

కటకటా! హింసాత్మకంబు
కష్టసాధ్య మర్థాపహా।
మటు గాదని చేసినా స్వర్గ
మందిర సుఖముల నొంద న
చ్చటి వారలు నీ సుకృతము
సడలె దేవసభయందుం
డుట పొసగదు. జరుగు మనుచు
నుర్వికి బడద్రోయుటెటు ॥ ఇటు॥

వచ. : జీవ ఘాతతో గూడినదియున్నూ, శరీరాయాసమును గలుగజేయునదియున్నూ, ద్రవ్యమున వ్యయ పరచెడిదియున్నూ అగు యజ్ఞమును బ్రహ్మస్వరూప మని మాటిమాటికి శిక్షించి చెప్పెదవు. కాదని హింసాత్మకమ్మునకు సహించి, చేసినప్పటికిని స్వర్గభోగముల నిచ్చును. ఆ దేవలోక సుఖము లనుభవించు చుండగ కొంత కాలమున కచటనున్న వారు 'ఇప్పటితో నీ పుణ్యము తీరిపోయి నది. ఈ దేవలోకమున నుండ దగుదువు కావు, పొమ్మ' అని తలక్రిందుగా భూమి మీదికి పడద్రోయగా, దిరుగ జన్మ నొందిం చునట్టి యజ్ఞములను ఇందరు విన్నగా, నుత్కృష్టములని యభి వర్ణించుట తగునటయా, స్వామీ!

బ్రాహ్మ : 1 కుటిలాలక ! అహహా ! విన
గూడని యమ్మాటలు నీ ।
కెటుల దోచెనో ? శాస్త్రార్థా
యినివలె ప్రచురించెదు; వా ।
కృటిమ మెరయ, జ్ఞాన మనుచు
బలికెద వెవరనగ వింటి ।
వటు గాకుండిన శాస్త్రి
వాసనలే కూరకుండక కుటి ।

వచ. : సర్వోత్కృష్టమైన అగ్నిష్టోమాదులను కర్ణకఠోరముగ నిందించెద వయ్యయ్యో ! నీవు శాస్త్రార్థమును దెలియక తెలిసి నటుల బలికెదవు. నీ వాక్ప్రౌఢిమ నిందరకు దెలియు నటుల, వారు మెచ్చుకొనుదురని భావించితివి కాని వేరొక కార్యము కాదు. లోకమున జ్ఞానము కలదని యెవరనుకొనగా వింటివో, అవి యొకటి చెప్పి వాదించెదవు. కాని, 'శాస్త్ర సంప్రదాయము నే నెఱుంగ' నని యూరకుండక ఇలా నాతో సమానముగా వాదింప వచ్చునా, లలనామణీ!

భామ : 2. నిజము బల్కినను అదియు
నిష్ఠురమై తోచు నెల్ల
ప్రజల కనుట నిక్కముగా
జెప్పెదము, నన్ను నిటుల ।
మీరు తగవు లాడుటకునై
యుపనిషదులు పల్కె
నొకడె మార్గ మజ, రు
ద్రాదులకునైన నన్య ।
పదము లేదనగా నిపుడు ॥ ఇటుల ॥

వచ. : 'నిజమాడితే నిష్ఠుర మవు' నని వాడుక గలదు. అది మీ యందు నిప్పుడే కానబడు చున్నది. కోపము సేయక, కాని

మాటలాడక చిత్తగింపుడు. అది ఎటువలె నంటే, 'ఉపనిషత్తుల యందు పరబ్రహ్మమును పొందుటకై ఒక్క మార్గమే కాని, వేరు దారిలేదు, అను విషయము దెలిసి యుండియు నీలాగున సన జెల్లునటయ్యా, అయ్యవారూ!

బ్రాహ్మ: 2. గజగామిని! ఇ య్యర్థము
కల్లగాదు, సత్య మరయ,
సుజనులు సాంఖ్యము యోగము
జూచెద రొక దారిగ నది,
భజనీయము, సత్కర్మకు ఫల
మగు నీ జ్ఞానము నరయ,
కుజనులు నెరుగరు, ఎక్కువగ
సాంఖ్యము కన్నను కర్మ సుమీ ॥ కుటిల ॥

వచ.: ఓ గజగామినీ! ఉపనిషద్వాక్యము నిజ మగును. సత్పురుషులు కర్మ జ్ఞానములకు భేదము లేదని, ఒక్కటే దారి యని యర్థము జేసి యున్నారు. సత్కర్మలకు ఫలము మనశ్శుద్ధి. దీనిచే స్వస్వరూప జ్ఞానము కలుగుటకు ఈ యర్థమును ఆ యోగశాస్త్రమైన భగవద్గీత యందే శ్రీకృష్ణపరబ్రహ్మ, అర్జునున కుపదేశించి యున్నాడు. అందు సాంఖ్య మను జ్ఞానమున కన్న కర్మయోగమే అధికమని బోధింపబడినది. కాబట్టి, భగవద్వాక్యమును కల్ల అన దగునా, పల్లవపాణీ!

భామ. 3.: ధరణీసురవర! అహింస పరమ
ధర్మ మనెడి మాట,
నెరిగి, యెరు గనటుల జీవ
హింసాత్మకమైన మఖము అ
పరిహార మనియెద వింకొక

పలుకు కల దది తెల్పెద విను
కర మరుదుగ, "ఘాతన్ న
ఘాతకో విప్ర" యనుట ।
నెరిగి ఇటు లనంగ తగ వగునా ? ॥ ఇటు ॥

వచ. : స్వామీ ! "అహింసః పరమో ధర్మః" అను న్యాయముచేత పరులకు బాధ కలుగజేయకుండుట పరమధర్మమని యెరిగియుండి యుండియు ప్రాణి హింసాత్మకమైనటువంటి ఒక్క యాగమె పరమధర్మ మనియెదవు. అదియునుగాక," ఘాతన్ న ఘాతకో విప్రః " అని శాస్త్రము ఘోషించుటలేదా ! కనుక, 'విప్రుడు తన్ను ఘాత చేసిన వారికైనను,ఘాత చేయువాడు కాడు'అను అర్థము నెరిగిన వాడవయ్యు, విప్రుడవై యుండియు పశుహింసతో గూడిన యజ్ఞమును ఉత్తమమని ఈలాగున ననజెల్లునటయ్యా !

బ్రాహ్మ. 3 : పరమేశ్వరు నాజ్ఞ జేయ
బరగు జన్నమును హింసా ।
కర మనరా దితర కార్య
కరణ ధర్మముల నిచ్చట ।
నెరపితి వింతటికి మున్నె
నే దెల్పితి స్వస్వకర్మ ।
మరసి, చేయునదియె, జ్ఞాన
మని తెల్పిన వినియు మరల ॥ నిటు ॥

వచ. : తరుణీమణీ ! భగవానుని ఆజ్ఞ చేయబడు అతని రూపము లయిన యాగములను హింస అనరాదు. యజ్ఞము లందు గాక, వేరయిన కార్యములందు నట్టి పనులు మేము చేయు చుండినట్లయితే హింస యగును. సహజమగు కర్మయందు దప్ప, ఇతరములందు మా బ్రాహ్మణులు, అపకారము జేసిన వారికైనను ఉపకారమే చేయుదురయా, తరుణీమణీ !

భామ. : 4. ఘనుడగు నవ్విభుని వలన
జనియించని దొకటి కలదె ?
అణువాదిగ నన్నియు జూడ
నమ్మహితుని రూపములౌ ।
నణువునకు నణురూపుడయ్యు
నధికము కన్న నధికమయ్యు ॥ఘను॥
గనుక నన్నియును సమాన
మనగ యాగ మెక్కు వనుచు ॥ నిటు ॥

వచ. : స్వామీ! ఆ పరమేశ్వరుని వలన పుట్టనిది అణుమాత్రమైనను లేదు. అట్టి స్థావర జంగమాదులనున్నూ, ఒక్కటిగ జూడక, కొన్నింటిని ఎక్కువగనున్నూ, కొన్నింటిని తక్కువగనున్నూ జూడవచ్చునటయ్యా! ఈశ్వరుడు సూక్ష్మమునకంటె సూక్ష్మమున్నూ, స్థూలమునకంటె స్థూలరూపుడున్నూ, సర్వము తానైనవాడయినపుడు యజ్ఞము లెక్కువని చెప్పవచ్చునా! అయ్యవారూ?

బ్రాహ్మ : 4. విను మెరుగుదు, సచరాచరమును నే
విభు డనుచు నందు వనజా ,
సనులకును నల్ప మనుజులకును
సమాన మగునె ।
మును శ్రీకృష్ణుడు, కవ్వడి
కిని దత్త్వము దెలుపు నపుడు ।
తన విభూతి రూపము లే
వని చెప్పెనో తెలియగదే ॥ ఇటు ॥

వచ. : భామరో! బ్రహ్మాది స్తంభపర్యంతమునైన చరాచర ప్రపంచ మంతయు సర్వేశ్వర స్వరూపమని తెలియుదును. అందు జగత్సృష్టికర్త యగు బ్రహ్మదేవునికిన్ని, అల్పుడగు మానవునికిన్ని, సమానము కాదు. తారతమ్యము కలిగియే యుండును.

దేవాసుర తిర్యక్ స్థావరాదులలో శ్రేష్ఠములైన కొన్ని రూపములు తానని ఎలాగున చెప్పెనో, అవి నీకు తెలియక అంటివి. కాని, తారతమ్యము కలిగి యుండును కాదా, ఇగురుబోడీ!

భామ : 5 నిరతము మరువక నిజహృ
త్సరసిజ మధ్యమున నుండు।
పరమాత్ముని యందు నెరుక
మరచియు, నాగ్నిష్టోమో।
త్కరమై చేసినను భూమి
సురుడైన, దివిజుడైనను!
పరగ సువ్రతుండైనను
హరిని మెచ్చజేయ డనగ ॥ నితుల ॥

వచ. : స్వామీ! హృదయకమలకర్ణికాంతర మందున్న ఆత్మను తెలియక, యజ్ఞములను జేసిన బ్రాహ్మణుడైనను, దేవతలైనను వ్రతనిష్ఠుడైన భగవంతుని మెప్పించజాలరు కదా, అయ్యవారూ!

బ్రాహ్మ : 5. సరసిజముఖి! హృత్స్థితుడగు
పరుని దెలసియైన కర్మ!
నిరసించుట తగదు! జనక
నరపతి మొదలయిన పెద్ద!
లెరుగక, హయమేధాద్య
ధ్వరములు జేసిరొకో? నీవు మది!
హరలకన్న నెక్కువైతివా?
దురతిశయమున ॥ఇతుల॥

వచ : తరుణీమణీ! తన మనస్థితుడగు పరమాత్ముని దెలిసియు గర్మల నిరసింపక, చేయ దగును. పూర్వులగు జనక మహారాజు మొదలగు దివ్యజ్ఞానులు పరమును దెలిసియు, నిత్యనైమిత్తికములు

నలుపుచు నశ్వమేధాది క్రతువులు చేసిరని గ్రంథములు ఘోషించు చున్నవి. వారందరు తెలియనివారలై ఆ కర్మల నాచరించిరా? అంతకంటె నీవు మహా మేధావంతురాలవా? ఇంత దురతిశయ ముగ బలుక దగునా, భామారత్నమా।

భామ : 6. పరగ యజ్ఞ దాన తప
శ్చరణ శౌచ శీలవ్రత।
పరత జేసి, మీర ల
పరమ పురుషు బట్టుకొనగ।
తరముగాదు, సుమ్మెంతయు,
వెరపు మరపు లేక సదా।
స్థిరమతిని ననన్య భక్తి
గరపిన హరి, మెచ్చు ననగ ॥ఇటుల॥

వచ : స్వామీ! యజ్ఞ దాన, తపోదాన వ్రతములను జేసి ఆ ఈశ్వరుని బట్టగల మనుకొంటిరో? అందువలన, మీకు బట్టు బడడు. భయ విస్మయములు లేనివారలై ఇతరముల యందు బుద్ధి నుంచక, నిశ్చల భక్తి గలిగి యుండినచో నా ఈశ్వరుడు ప్రసన్ను డగును. ఇది మాని యజ్ఞ దానాదులు చేసి భగవంతుని మెప్పించుట మీ వలన గాదు గదయ్యా!

బ్రాహ్మ : 6. పరమేశ్వరు కిష్టములై
పరగు యజ్ఞదాన, తప।
శ్చరణ శౌల శీలవ్రత
సరణులు నత్యాజ్యములని।
మెరపిన న య్యీశ్వరునకు
పరమప్రియు డతడు, యజ్ఞ।
పురుషు డనుచు దెలిపిన విని
యరుదయ్యెడు, నమాన మనగ ॥ విటు

వచ. : తరుణీమణీ ! ఆ భగవంతునకు ఇష్టములైన యజ్ఞ దాన, తప శ్శౌచములను జేసినందు వలన ఆ ఈశ్వరుడు సంతుష్టి నొందును. ఆ దేవుడు యజ్ఞపురుషుడని చెప్పగా వినిన్ని, నాతో నీ విధముగ వాదింప వచ్చునా, భామామణీ !

బాము : 6. వేడుక జన్నముల మాన
గూడ దటుండ నిమ్ము !
చూడ వలయు వాని కూచి
పూడి దేవుని రూపములౌ,
వాడి మీర నంటివి బల్
పోడిమితో మీ కవి సమ
కూడుట మావలన గాదె !
జాడ లెరుగక సతి, ఇదనుచు ॥ నిటు॥

వచ. : యజ్ఞములను ఎప్పటికిని విడువరాదని చెప్పెద, వది యటుండ నిమ్ము. చూతముగాని, భగవద్రూపములని మీరు చెప్పెడి యజ్ఞములను మీరు జేయుట మా సహాయము చేతనేకదా'' స్వామీ ! అడుదాన నని నాయందు లక్ష్య ముంచరు. కాని, మీ మనస్సునందు ఆలోచించి చూడుమయా, అయ్యవారూ !

బ్రాహ్మ. శా : ఓ కంజాయతనేత్రి ! సత
నోద్యోగక్రియా వేళలన్,
మా కందించు సమస్త వస్తువులు
సమ్మానంబులన్ జెందగన్.
మీ కెట్లయ్యె, పదార్థ సంతతులు
నే మే మిత్తురో వాని న
స్తోకోక్తిన్ వచియింపుమా ! వినెద
మా సోమంబులం దెల్లడన్ ॥

వచ. : మీరు మా కందించెడి పదార్థంబులకు మా పెద్దలు మిమ్ము చాలా చాలా మర్యాదలు చేసినారని యంటివి. మీరు మా

కందించెడి పదార్థము లెవ్వియో, మా వలన మీరు సన్మానంబు లెలా పొందిరో చెప్పుమో, తరుణీమణీ !

భామ, కం. : మా వలన బాలు బెరుగుల్
జీవముగల మేకపోతుఁజెలువుగ గావం
గా వలసె, నెయ్యి, మున్నుగ
నీ వస్తువులన్ని లేక ఎటులగు గ్రతువుల్ ॥

వచ : స్వామీ! మీ యజ్ఞములకు మా పాలు, మా పెరుగు, మా నెయ్యి, మా పశువులు మొదలగు పదార్థము లన్నియు లేనిది యజ్ఞముల నెట్లు సేతురో చెప్పుమయ్యా, స్వామీ ॥

బ్రాహ్మ : కం. : మా వద్ద పాలు పెరుగులు
లేవా ? దుగ్ధముల నొసగలేవా, గోవుల్
కావా, అవి దధి ఘృదములు;
మా వలననె యనుట గర్వమందుటగాదే !

వచ. : మా వద్ద పాలు, పెరుగు, నెయ్యి, పశువులు మొదలగునవి గాకపోతే మా వద్ద గోవులు లేవో ? అవి పాల నీయవో? వాటివల్ల పెరుగు నెయ్యి మొదలగునవి రావో ? వాటివలన మా యాగములు జరుగ నేరవో ? అటువలె ననక మావలననే మీ యాగములు జరుగుచున్నవంటివి. ఇది ఆత్మగర్వముగా దోచు చుండుటలేదా, తరుణీమణీ !

భామ : దర్బా-చతుర ప్రగతి- త్రిపుట-

ఎటులనె జెప్పిన
నటులనె ప్రతిమాట ।
ఘటియించెదవు.
దాన కార్యమేమి ? యొ
క్కటియైనా మెచ్చ
వీ కఠిన మేమి ?

దిటవుగ నిందా రెదుట
నీవు మాకుల
పటిమ తృణప్రాయ
మటులనె జూచి, మాకె ।
ఘటముల కొలది పాల్ పెరుగు లు
త్కటముగా గలవంటివౌ-పశువు లొ।
కటి లేకుండిన యజ్ఞము
లెటులగునో ।
ఘటికుడవు, తెలుపుమా ! ॥ ఎటు ॥

వచ. : నేను ఎన్ని విధములుగా జెప్పినను, వాటి కన్నిటికి ప్రతికక్ష మాటలు బలికెదవు. అందువల్ల నయ్యేడు పని యేమియును లేదు. నేను జెప్పెడి మాటలయం దొక్కటియైనా బాగున్నది, అనవు. నా యం దింత నిర్దయ యేలనయా ? ఈ సభ యెదుట మా కులమును తృణప్రాయముగ గణించి, మా వద్దనె పాలు, పెరుగు మున్నగు పదార్థము లున్నవంటివి. మా పశువు లేనిది యజ్ఞములను ఏలాగున జేతురో చెప్పుమయా అయ్యవారూ !

బ్రాహ్మ వచ. : కసిదీరకా యజ్ఞ, విసర మెల్ల మా
పశువుచే గాదె పెంపొసగ మీ రందరు
వెస జేయుటకు గర్వా, మొసగెనో ? నీకాది
పస యేమి దానలేదు సుమీ కాసింతైనన్
బిసరుహానన ! వినుము, మా సాహసము దెల్పెద
పిష్టాముచే పశువు చేసి యొనర్తు, మీ రా
దెసకు రాఁ బని గలుగు నటనే ॥ కసి ॥

వచ. తరుణీలలామా ! ఏ విధముగానూ కోపము దీరక "యజ్ఞముల నుపాయముగా, మా పసువు చేతనే చేతురు" అని నీ మనస్సులో చాల అభిమాన మున్నదేమో ! అందువలన నెంత

మాత్రమును కార్యము లేదు వినుము, మా యొక్క సామర్థ్యము. మీ పశువు లేకుండగనే మేము పిష్టము చేత పశువును సృష్టించుకొని, ఆ పశువు చేతనే మేము యజ్ఞమును పూర్తి చేసికొందుము. అలా చేసినట్టులయితే మీరా వైపునకు రావలసిన పనిలేదు కదా భామా !

భామ, 2. : వసుధామరవర్య ! విశదముగా
జెప్పెద సుమ్మీ ! మాటకు
విసుగక మీ యజ్ఞ పశువుకు !
ముఖ్యమై పరగు మేకపోతులె సుమ్మీ !
వానిని ఆ యినుమంత పిండిచేత
పశువుగ జేయుదుమని పల్కెదవు !
పస లేదందు వపాదికము లేదు సుమీ ! ॥ ఎలు ॥
అందగ్ని దేవుని కేమొసగి తృప్తుని జేసెదరో॥

వచ. ఓ బాపనయ్యవారూ ! ఈ భామ అధికభాషిణి. అని విసుగక చిత్తగింపుడు. యజ్ఞమునకు ముఖ్యమైనది భాగపశువు గదా ! అట్టి ప్రత్యక్ష పశువును విడనాడి కొంచెమంత పిండితో పశువును చేసెదమనియెదవు. దానియందు వపాదికములు లేవు గదా! యాగమునకు హోమము ముఖ్యము కాదటయ్యా విప్రవర్యా! అట్టి వపాదికములు లేని హోమము లేమి ముఖ్యములు ? అందుకు బదులుగ నేమి యిచ్చి అగ్నిహోత్రుని తృప్తునిగా జేసెదరో చెప్పుమయా, భూసుర వంశరత్నమా !

బ్రాహ్మ : 3. కుటిలాలక ! అర్ధజటిలములై అత్యు
త్కటములైనా, కదా,
పటుతర సన్మంత్ర
పఠనచేత నగ్ని,

భట్టారకుని మెచ్చ
నటుల జేసెద - మెం।
తటి వారలైన పె
ద్దుటకు జాలరు - య।
న్నిటికి మిక్కుటముగ
నయోక్తి నుతి చే।
యుట, మహాత్ములు
వినయమునకు మె
చ్చుట నిజము
తెలియవటవెవీ ॥కసి॥

వచ. : భామామణీ! అర్థతరమములైన - పటిమ గలిగిన శ్రేష్ఠములైన వేద మంత్రముల చేత నగ్నిహోత్రుని సంతుష్టు జేసెదము. ఎంతటివారైనా, పదార్థముల నిచ్చి సంతోషము నొందించుట కష్టము కాదా! కొంచెమిచ్చియైనా, వినయోక్తులచేత స్తోత్రము చేసినట్టయితే మంచి మనసు గల పెద్దలు సంతోషించి నటుల ఈవికి సంతోషించరు. కాబట్టి మహాత్ముడైన అగ్ని భట్టారకునకు మంత్రములచేత, స్తోత్రములచేత సంతోషము కలుగునట్లు చేతుము. అదిన్నీగాక, వేదములయందే పిష్ట పశువును యాగములందు నుపయోగింప వచ్చునని, చెప్పియున్నది కదా, పల్లవపాణీ!

భామ : 4. పటుతర సన్మంత్ర
పటులిచేతనె వహ్ని।
నెటుల మెప్పింతు రెం
తటి వారలైన నా।
కటి జెందు వాని కే
మిటికి సన్నుతి? దాన।
ఘటియించునె తృప్తి
కడుపు నిండాకను, మీ।

రతులనైన పదార్థముల దె
చ్చుటు పనియేమి? అవన్నీ గూర్చి క
పటము లనియెదవుగాక । మా పశు
పటులి గావలదయ్యా! నీ ॥వెటు॥

వచ. : అయ్యవారూ! "అర్థపటుత్వముగల మంత్రముల మహిమ చేతనే అగ్నిహోత్రుడు తృప్తుడౌనంటివి. వట్టి మంత్రముల చేతనే ఆ దేవుడు తృప్తుడు కానేరడు." ఎటువంటి మహితుడైనా, ఆకటిబడి యుండునపుడు, అన్నోదకముల నీయక వినయ విధేయతలు, మంచిమాటలు, స్తోత్రపాఠములు చేసి ప్రకటించినంత మాత్రముననే ఆకలి తీరునా, స్వామీ! వినమితుడైన నేమి ఫలము? అలాగునైతే యజ్ఞమునకు గావలసిన సంబారములు అన్నింటిని సంపాదించి యుంచుకొన వచ్చును గాని, మా పశువు మాత్రము అక్కరలేదనుట కపటము గాదంటయ్యా, మహాత్మా!

## యజ్ఞ పట్టు

బ్రాహ్మ : 4. చేడియరో! వెనుక వా
దాడుచు నీచే యజ్ఞ
పోడుములను వినగా,
వేడుకయ్యెను, నాకు ।
పీడక కూచిపూడి
దేవుని గొని ।
యాడుచు భక్తితో
గూడి ఇపుడు నా ।
తోడ వాదము
లాడి జాడలతినయ భయము లే
ర్పడ రూఢిగ మృదు మధుర
వాక్కుల ।
నాడు మీ సభవారలు వినగ ॥కని॥

వచ: భామామణీ! ఈ వాదములు తరువాత జేయుదము గాని, యజ్ఞకథ నీ వలన వినవలయును అని యున్నది. ఆ కథను భయపడక, నీ ఇష్టదైవమగు కూచిపూడి దేవుని భక్తితోదలచి, ఈ సభాసదులు విని సంతసించు నటుల మృదువైన తియ్యని మాటలతో వినిపింపుమా, తరుణీ!

భామ: సీ. విభ్రాజిత సుధాకరాభమాతంగ శు
భ్రభనిభృత శారదాభ్రాభమగుచు,
ప్రపుల్ల సద్యశోభరితు లీ గొల్చున్న
సద్బ్రాహ్మణుల పాద సరసిజముల।
కబ్బుచు సాష్టాంగ మొనరించి దీనిని
అబ్బబ్బ! చెప్ప నా కలవికాదు!
తప్పులు సవరించి దయజూచి మెప్పు నా
యెడనుంచి, పెనుపు గావించి ఘనము

తే॥ గీ॥ గాంచి వినుతించి కడు సంభ్రమించి మించి,
మనవి జేసెద నార్యమండనులు వినగ,
యజ్ఞములు జేయు విప్రుల యందుమున్ను,
తనదు తాత తండ్రులు యజ్ఞమును గడంగి,
సేయకున్న దౌర్బ్రాహ్మణు డాయఘంబు,
మాన్ప బ్రస్తుతమున జేయు మహిత కార్య
మును విను డనుమానమును వీడి ఘనము మీర।

వచ.: ఈ యజ్ఞ పూర్వోత్తరములను నన్ను జెప్పమని యంటిరి. కాని, ఈ కథను జెప్పుటకు నేను సమర్థురాలను గాను. అయినను ఈ సభాసదులు పూర్ణచంద్రుల వలెనున్నూ, అయిరావతము వలెనున్నూ, శరత్కాలమేఘముల వలెనున్నూ, లోకమందంతటు వికసించిన సత్కీర్తితో గూడిన సద్బ్రాహ్మణుల చరణ కమలములకు సాష్టాంగ నమస్కారములు చేసి, నేను చెప్పు నీ కథ యందు గల తప్పులను క్షమించి, నాయందు అనుగ్రహముంచి, నన్ను మెచ్చి, పోషింపవలెనని సభాసదులైన విద్వాంసుల నందరిని స్తుతించి సంతోషముతో మనవి జేసెదను.

బుధశ్రేష్ఠులారా ! చిత్తగింపుడు. అది ఎటువలె నంటే- తొలుత యజ్ఞము దలచిన విప్రుడు తన తాతదండ్రులు యాగమును జేయకపోయినటు లయినచో దాను దౌర్బ్రాహ్మణు డగును. ఆ దౌర్బ్రాహ్మణత్వము తొలగిపోవుటకు ముందుగా ప్రాయశ్చిత్త పశువును బట్టుకొన వలయును కదా, స్వామీ !

సీసార్థము : మొదలు ప్రాయశ్చిత్తమున కంచు వారలు
మందకడకు వచ్చి మరక జూచి।
బేరంబు లాడుచు పిక్కటిల్లుచు మేను
బలిసిన చింబోతుఁబట్టి, దాని।
వెలనొసంగుచు దెల్ల వెంట్రుక లేనట్టి
నల్లని చింబోతు నెల్లవారు
పట్టి గొంపోయి యూప స్తంభమున గట్టి
వధియించి దాని పలలము నేతితో
పక్వముగ జేసి, కొంత హోమము।
విధిగ జేసి, అ మ్మిగిలిన యదియు
పదపడి పురోడాశ,
మనుచు దినుటకు ॥ వధియించి ॥

వచ. : భూసురవర్యా! మీ పెద్దలు ప్రాయశ్చిత్త పశువు కొరకు మా మంద కడకు వచ్చి, మా మగవారితో బేరము జేసి, మేకపోతులను బరీక్షించి, వాటికి యొక్క తెల్ల వెంట్రుకయైన నుండరా దంటారు. అది నిజమేనటయ్యా! ... అయ్యవారూ! అట్లుగాక తప్పిజారి తెల్ల వెంట్రుక యున్నట్లు లయితే ఆ పశువు పనికి రాదంటయ్యా!, లేక ఆ ప్రాయశ్చిత్తమును మీరే చేసికో రాదంటయ్యా!...అట్టి లక్షణములు కల పశువును గొనిపోయి, యూప స్తంభమునకు గట్టి, దానిని వధించి, ఛేదించి ఆ పలలమును నేతితో పక్వము జేసి, కొంత హోమము జేసి, తక్కిన దానిని 'పురోడాశము' అని తాను భక్షించినట్లయితే దౌర్బ్రాహ్మణ్యము తొలగిపోవును- కాదంటయ్యా, స్వామివారూ!

మత్తకోకిల :

సొంపు మీరగ నార్యులగ్నిష్టోమ మొప్పుగ జేయ మ
వ్వంపు బనులను దీర్చి తొలుత ప్రవర్గ హోమము జేయుచో
వింపుతో మా మేక లావుల నెయ్యి పా ల్దెప్పించి ఘ
ర్మంపు పాత్రల నుంచి పక్వము మంచిగా గావించుచున్॥

వచ.. స్వామీ! మీ పెద్దలు అగ్నిష్టోమము జేయుటకు ముందుగనే యజ్ఞ సంబారముల నన్నింటిని సంపాదించి పెట్టుకొని ప్రవర్గ హోమము జేయుటకు, మా మేకల, ఆవుల, పాలు, పెరుగు, నెయ్యి తెప్పించి బంగారు పాత్రలయం దుంచి చక్కగ హోమము కొరకు పక్వము జేయుదురు కాదటయ్యా!

కంద. : అతి పక్వమైన తరిగని
ప్రవిమలమగు వేదమంత్ర పాఠోక్తిగ నా
హవనీయమందు సన్నగ
ప్రవహింపంగ జేతురు గస్రువాదులతోడన్॥

వచ. : ఆ ఘృత క్షీరములు పక్వమైన సమయము దెలిసి స్రుక్కు, స్రువము మొదలుగాగల పరికరములతో నాహవనీయాగ్ని యందు హోమము జేయుదురు కాదంటయ్యా, స్వామీ!

మత్తే. : తగ నా ఋత్విజులందు గొందరు
'మహేంద్రాగచ్ఛ, గచ్ఛ'ంచు ముం
దుగ 'అశ్రావయ.' యంచు గొందరును,
'అస్తుశ్రౌష' టుంచున్ మరిన్
నిగమోక్తిన్ ద్రిదివేశముఖ్య దివి
జానీకంబులున్ దృప్తి నొం
దగ స్వాహాంతముగా ఘృతాదికము
లందన్ హోమముల్ జేయుచున్॥

వచ. : అయ్యవారూ ! ఋత్విజులలో కొందరు వేదమంత్రములతో నింద్రాది దేవతలను రమ్మని ఆహ్వానింతురు. అపుడు వారు 'ఇదిగో వచ్చియున్నాము' అని యందురు. ఈ విధముగ నింద్రాది దేవతలకు బరితృప్తిగా నాజ్యాదులచే హోమంబులు చేయుదురు గాదటయ్యా, స్వామీ !

మత్తే. : మును మున్నే వచియించితిన్ బుధులు
మమ్ముంగోరి యర్థించి చ
క్కని మా మందను నింద్ర నీలమణి
గా గాంతుల్ ప్రసారించు మే
కను గొంపోదురు, యజ్ఞశాల కపుడే
గాంచించి మీరందరున్,
జను లెల్లన్ గనుచుండ, లేశమయి
నన్ జాలిన్ మాలి చిత్తంబులన్॥

వచ. : అయ్యవారూ ! ఇదివరకే చెప్పియుంటిని. ఏమని అంటే, మీ బ్రాహ్మణులు మా మందకడకు వచ్చి, మమ్ములను బ్రార్థించి, ఇంద్ర నీలమణితో సమానమగు నల్లనిదిన్నీ, మిక్కిలి బలిసినదిన్నీ యగు మేకపోతును పట్టుకొని పోదురుగదా ! మనవి జేసి యుంటిని. ఆ పోతును సకలజనులు చూచుచుండగా యజ్ఞశాలకు జాలిమాలి తెప్పింతురుకదయ్యా, స్వామీ !

తే. గీ. : మహితమైన ప్రవర్గ్యహోమంబు దీర్ప
పశువు నచ్చోటికిని వేగ బట్టి తెచ్చి
దాని బూజించుచును మంత్రతతులచేత,
స్నాన మొనరించి శుచిజేసి నయముడించి॥

వచ. : అయ్యవారూ ! ప్రవర్గ్య హోమంబు జేయుటకు మా పశువును యజ్ఞశాలకు దెప్పించి, మంత్రములచే నా పశువును స్నానము జేయించి, పూజ చేసి, శుచి గావించి, అనయులై యపుడేమి చేయుదురో చెప్పెదను, వినుమయా !

కం. : అవనీసురశేఖర ! విను
మావలి కథ జెప్పెద నతిమహితుల్ కుశ ర
జ్జువు లెల్ల బట్టి నిలతురు
అవిరళముగ దక్షిణాగ్ని కటు తూర్పుదెసన్॥

వచ. : అటుతరువాత ఆ పశువును స్నానాదికముచే పరిశుద్ధి గావించి, దక్షిణాగ్నికి దూర్పుదెసగా దర్భ రజ్జువులు చేతబట్టుకొని నిలతురు కాదంటయ్యా, స్వామివారూ !

బ్రాహ్మ. తే. గీ. : అబల దక్షిణంబున నొక యగ్ని మరల
తూర్పుదెస నొక వహ్నియందు విది యేమి ?
పశ్చిమంబున నుత్తరభాగముననుఁ,
నాల్గుమూలల నగ్నులు వెల్గునొక్కొ ?

వచ. : ఇగురుబోడీ ! తూర్పుదెసయందు నొక యగ్ని, పడమరయందు నొక శిఖి, దక్షిణమం దొక వహ్ని, ఉత్తరమం దొక కృశానుడు - నిల్లే నాల్గు మూలల నాలుగగ్నులు, దుర్మార్గుల ఇండ్లమీద నొక యగ్నియని ఇన్ని యగ్ను లుండునా, భామామణీ!

బ్రాహ్మ. కం. : సవనక్రియ లెరిగియు, నో
అవనీసురవర్య ! ప్రశ్న లడిగెదవుగదా!
ఇవిగాక, గార్హపత్యా
హవనీయము దక్షిణాగ్నులనె త్రేతాగ్నుల్ ॥

వచ. : స్వామీ ! యజ్ఞసంబంధము లగు యావత్క్రియలు తెలిసి యుండియు "తూర్పు మొద లన్ని దిక్కులయందు నన్ని యగ్ను లుండునా ?" అని నన్ను నడిగెదవు. కాని, అది సరి కాదయ్యా, స్వామీ ! మరియేమి అంటే, ఆవహనీయ, గార్హపత్య, దక్షిణాగ్నులనే త్రేతాగ్నుల నెరుగవటయ్యా!

శా. దాపై యాహవనీయ దక్షిణ శిఖి
ద్వంద్వంబుకున్ ప్రాగ్దిశన్!
స్థాపింపన్ బడి, చూడ నెంతయును
నందంబొౌచు నున్నట్టి యా
యూప స్తంభము చెంతకున్ దిగిచి
యం దున్నట్టి మర్త్యాళికిన్
జూపట్టన్ దమచేత నున్నకుశ
రజ్జు శ్రేణిచే గట్టియున్॥

వచ. : బాపనయ్యవారూ! ఆహవనీయ దక్షిణాగ్నులకు సమీపముగా తూర్పుదిక్కున స్థాపన జేసియున్న సుందరమైన యూప స్తంభము నొద్ద కా పశువును ఈడ్చి తెచ్చి, సకలజనులు చూచుచుండగా, తమ చేతులయందున్న దర్భ త్రాళ్ళతో గుదియించి కట్టుదురు కదయ్యా!

బ్రాహ్మ, కం: జను లిటు దీపస్తంభం
బనియెద రిమ్మాటు నోటబట్టకనా? నీ
వనియెద యూపస్తంభం
బని, దాని కిది యరయగ బాఠాంతరమే?

వచ. : ఈ లోకు లందరు దీపస్తంభ మని వాడుచుందురు కదా! నీవు యూపస్తంభ మనియెదవు. ఈ జనులకు యూపస్తంభం బనుటకు నోరు దిరుగకనా లేక దీపస్తంభంబునకే యూపస్తంభం బనునది పాఠాంతరమా, చెప్పుమో, తరుణీమణీ!

భామ, సీ. : అరయఁ యూపం వినా, యాజన మప॰శ
స్తం, బందు రదియు నిజంబ కాదె?
అది యెట్టిదన సోమయాజి ఋత్విగ్జనో
పేతుడై పత్నీసమేతు డగుచు

జనులతో గూడి *నిస్సానాది వాద్యముల్
సలుపగా నొక బిల్వశాలిని యొద్ద
కరిగియు, మంత్రోక్త మరసి నీరుఁ జిలికి
కొట్టించియును లెన్న గొనబుగాగ

తే॥గీ॥ దాని జెక్కించియను బస్పునూనె బూసి,
తెచ్చి, ఆహవనీయాగ్ని దిశకు దూర్పు
స్థాపనము జేయుదురు, దాని 'యూప మంత్రు
అన్ని దెలిసియు నన్నేల యడిగెదయ్య!

వచ : 'యూపం వినా యాజన మప్రశస్తం' అని యందురు గనుక, యూపస్తంభము లేని యాగము చేయరాదు, కాబట్టి, అది యూపస్తంభమే గాని, దీపస్తంభము గాదు. స్వామీ! యూపస్తంభ మనగా నెటువంటిదంటే, సోమయాజి హోతాదిబుుత్విగ్గన పరివృతుడై మేళతాళములతో నొక బిల్వవృక్షము కడకు బోయి, ఆ వృక్షమును మంత్రోక్త జలముచే స్నానాది విధులచే బూజించి, ఆ చెట్టును గొట్టించి, దానిని జెక్కించి, పసుపు నూనె బూసి, దానిని ఆహావనీయాగ్నికి దూరుపు దెస స్థాపన జేతురు. దానికి యూపస్తంభ మని పేరు కాదటయ్యా, అయ్యవారూ!

దర్వు : బిలహరి రాగము — అటుతాళము

వినుడీ! తెల్పెద బాగుగ నా యజ్ఞక
థను, మేటి రుచు లూరగ ॥ విను ॥

ఘనులై బాడబ జనులు గూడి పశు
వు నపుడె చాత్వాల దేశ
మ్మునకు గొనిపోయిన విధము దగ ॥ విను ॥

వచ. : మీ బ్రాహ్మణులు చేయు పనులు చెబుతాను వినుమయా, స్వామీ! పెద్దలగు విప్రు లందరు ఆ కుశ రజ్జువులచే బిగియ గట్టిన పశువును చాత్వాల దేశమునకు గొంపోదురు గాదయా!

---

* నిస్సానము : చర్మవాద్య విశేషము.

బ్రాహ్మ : చర. లలితాంగి! యేబది యారు దేశ
ములలోన నెవ్వరిదిఁ
దలప వినము, చాత్వాల దేశ మెందు
గలదొ ? దెలుపుము - అందు ।
కలిగిన కలుము లలవుల చెలువు
దెలియగ లేవె ? మేల్మేల్ ॥ లలి ॥

వచ. : భామామణీ! వినియెదగాక, బాగుగా దెలుపుమా। ఏబది యారు దేశములలో నెక్కడను 'చాత్వాల దేశ' మని విని యుండలేదు. అది ఎచ్చట నున్నదో, అందు గల శృంగారము లెవ్వియో, వివరింపుమా !

భామ : 2. బలసిన పోతులను బట్టి ప్రాణ
ములను దీసెడి తావును ।
దలచే రదియే చాత్వాల దేశ మా
స్థలము నందె బదుగురు బా ।
పలు గలసి, ప్రాణముల దీతురు ॥ విను ॥

వచ. : చాత్వాల దేశ మనగా, మీ బ్రాహ్మణు లంతా జేరి యజ్ఞపశువును ప్రాణము దీయు స్థలము కాదంటయ్యా స్వామీ !

బ్రాహ్మ : 3. ఎంత దుర్జను లయినా యొప్ప
దురె బ్రహ్మహత్య జేయుటకు, జ్ఞాన ।
వంతుగ బూజ గావింతురుగాని, హిం
సింతుర, సుంతైన తప్పు ఘ ।
టింతుర ? దంతిరాడ్గామిని ॥ లలి ॥

వచ. : 'మీ బ్రాహ్మణులు ప్రాణములు తీసినా' రంటివి. ఈ లోకములో బ్రాహ్మణుల యందు తప్పు లున్నప్పంటికి క్షమించి యూరకొందురు గాని, బ్రాహ్మణుల ప్రాణములను దీసి, బ్రహ్మ హత్యకు బాల్పడుదు రటనా, భామామణీ !

భామ : 3. అంతయు వినక 'బాపలను హిం
సింతురా' అనియెదవు।
వింతగ మీ బాప లంతా గూడి మేక
సంతతుల నంతయును అతిబల।
వంతముగ వధియింతు రంటిని ॥ విను ॥

వచ. : నేను చెప్పిన మాటను బాగుగా వినిపించుకొనక, 'బ్రాహ్మణుల ప్రాణముల దీతురా, భామా!' అనియెదవు. అది గాదయ్యా, అయ్యవారూ! 'బ్రాహ్మణు లంతా గూడి బలాత్కారముగా మా పశువుల ప్రాణములను దీయుదురు' అంటిని కాని, 'బ్రాహ్మణుల ప్రాణముల'నని కాదయా, స్వామీ!

బ్రాహ్మ : 4 కూరిమితో విందుము - ఆవలి
కథను, రాజముఖీ! పల్కుము ॥
మీరిన కూచిపూడి రాజమౌళి
పేరు నెద కూరిమితో దలచిన-సు
ధా రసము లూర సరసముగను ॥ లలి ॥

వచ. : అవలి కథను నీ యిష్టదైవమైన శ్రీ కూచిపూడి రామలింగేశ్వరస్వామిని స్మరించుచు నమృత రసము లొలుకు నటుల జెప్పుము, మధురవాణీ!

భామ : ద్విపద : తదనంతరంబున - న ధ్దరణి దేవతలు
పదపడి నా యజ్ఞ- పశువును శాలి।
వాహను రప్పించి- వాని నొప్పించి
సాహసంబున ముక్కు, శ్రవణంబు నాది;
గా; నవరంధ్రముల్ గట్టిగా మూసి
మానుగ గడదేర్చి, మమత బోకార్చి!
అందున్న వప బదిలంబుగ దీసి,
ఇందుపై నెయ్యిని నిరవుగ బోసి।
ఆ విధిని యజ్ఞేశు నమర సంప్రీతు

గావించుచును తమ గాత్రముల్ మరచి।
వావిరి గోడపై వ్రాసిన ప్రతిమ
కైవడి నుండ నక్కడి జనమంత!
మరియు ప్రాతఃకాల మధ్యందినాన
అరయగా వేది మధ్యంబునఁ జేయ।
దగినట్టి పనులు యథావిధి గాగ
మిగుల జేయుచు నందు మీదట బాగు
అనగ నగ్నికి హోమ మందున వ్రేల్చి
మును ముందు హోమ శేషము గొనివచ్చి।
'ఫల మిది' యంచు మృత్పాత్రాంతరమునఁ
నెలమితో గుడ ఖండ మిది మొదల్ గాగ।
బడవైచి నేతితో పక్వంబు జేసి
గడగి హోమము గొంత గావించి మించి।
తక్కిన యది హవిర్ధానమం దుంచి
వికృచు నటు యజుర్వేద ప్రయుక్తఁ
మంత్రోక్తి నాజ్య హోమంబు జేసియును,
సంతసించి తృతీయ సవనంబు నందు।
మరియు నంతర్వేది మధ్యంబునందు
తీరుగా గల ముఖ్య దేశాంతరముల।
విదితమౌ నవి యెల్ల వేడ్క గావించి
పదపడి యందునే పనులు జేయంగ।
వీనుల విందు గావించెడి సామ
గానము జేసి యుత్కలిక దీపింప।
తటుకున న ప్పురోడాశంబు దీసి
పటుతరంబుగ నిడా పాత్రమం దుంచి।
అధ్వర్యు డాదిగా నార్గురు భక్తి
సాధ్యంశములతోడ జతగూడి మంత్ర।
మొప్పుగా జదువుచు న ప్పురోడాశ

మప్పుడు యవ, ముద్గ, మాష, తిల ప్ర।
మాణంబుగను జూచి మది సంతసించి
దాని భక్షించి యందరికన్న మించి,
తాను గీర్తి వహించి తనర మన్నించి
గాన, నొండొరులచే గలుగునా, చెపుమ ॥

వచ. : అయ్యవారూ! మీ బాపలు ఆ పశువును కుమ్మరి వానికి అప్పగించి, వానిచే నా పశువు నవ రంధ్రములు మూయించి, ఊపిరి నాడకుండ జేయించి, బలాత్కారముగ జంపించి, ఆ కుమ్మరి వానిని పంపించి, వెంటనే అధ్వర్యుడు చూరకత్తితో నా పశువు కడుపు కోసి, అందున్న వపను దీసి, దానిపై నెయ్యి పోసి, హృత్కమలము మొదలగు నుత్తమాంగములను గోసి, యొక బానలో నుంచి వండి, కొంత హోమము జేసి, సామగానము నాలపించి, శాస్త్రములు పఠించి, ఇడాపాత్రమం దుంచిన హోమ శేషమును 'పురోడాశ' మనుచు, అధ్వర్యుడు మొదలుగాగల ఆరుగురు గూడి, ఆ య్యామిష మును యవ, ముద్గ, మాష, తిల ప్రమాణంబుగ భక్షణము చేసి, అందరికన్న దాను కీర్తిపొంది ప్రకాశించును కాదటయ్యా, స్వామీ! అధ్వర్యుడు సోమయాజియై తన భార్యతో గూడి, పురోడాశమును భక్షించి అంతట సోమపానము జేయునుగదయ్యా!

బ్రాహ్మ, : తే. గీ. ఇందుబోణిరో! నీ మది నించుకంత
సందియము బొందవేల? వీ రంద రెదుట।
సాన మొనరింతు రంటివో పడతి, సోమ
రసము పొల్పుగ నుతి సల్పు రాణ దెల్పు ॥

వచ. : వీరందరు వినుచుండగా, సోమరస పానము జేయుదు రంటివి. ఆ సోమరసపాన మనగా నెట్టిదో జెప్పుమమ్మా!

భామ. సీసార్థము : విను భూసురేంద్ర, నే విన్నవించెద మీర
లడిగిన య మ్మాట కనుగుణముగ
విశదంబుగను నా హవిరాజి తొలుతనే

బంచి సోమలత దెప్పించి పుణ్య
సతులు వేగమె పట్టు సరిగంచు పుట్టముల్
గట్టి, యుబ్బుచు రోటు బెట్టి వేడ్క
పాటలు బాడుచు బాగుగా ద్రొక్కియు
తద్రస మొక పాత్రఁ నుంచియు
మంత్రపూతముగ కుశలమీద
పొందించియు మసలక యా రస
మొక్క మాషమగ్నమాత్రమె సుమీ!
యెక్కువ ద్రావ సనిగాదు, యటు
లైన, నదియె సుమీ సురా
పాన సమం బనుచు విదుషులు
పలికెదరు; పానగదు సుమీ ।తద్రస॥

వచ. : సోమరసపాన మనగా, సోమయాజిగారు యజ్ఞ దీక్షను వహింపక మునుపు, తగిన భృత్యుల నాజ్ఞాపించి యరణ్యముల యందు వెదకించి, సోమలతను దెప్పించి రోటియందుంచి, పుణ్య స్త్రీలకు పట్టుపుట్టంబులు గట్టించి, పాటలు పాడించుచు ద్రొక్కించి, రసమును దీయించి, దానిని యవ–గోధుమగింజ మునుగునంత; ముద్గ–పెసరగింజ మునుగునంత; మాష–మినపగింజ మునుగునంత; తిల–నూవుగింజ మునుగునంత ప్రమాణముగ త్రాగవలెను. అంతకంటె నధికమైనదో సురాపాన సమంబు గనుక అటులచేయరాదు. అట్లు పానము జేయుటు సోమపానము కాదంటయ్యా, స్వామీ!

కం. ఈరీతి సోమపాన ము
దారత గావించి దీక్ష దాల్చినది మొదల్
గారవమున బూజించుచు
ధారుణి వేల్పులకు నన్నదాన మొసగుచున్.

వచ. : ఈ విధముగ సోమయాజిగారు దీక్ష వహించినది మొదలు, అవభృథ స్నాన పర్యంతము బ్రాహ్మణులందు శ్రద్ధా భక్తులు కలవాడై అన్నపానాదులచే సంతుష్టులనుగా జేయుచు నుండునుగదయ్యా, స్వామీ!

తురంగ ప్రయాతము :

నెమ్మి తుమ్మిపూల తెలిద
నమ్ము గ్రమ్మశాలి య।
న్నమ్ము కుందనమ్ముతో స
మమ్ము రంగుగల్గు సూ।
పమ్ము, కమ్మనైన గో ఘృ
తమ్ము పాయస మ్మ పూ
పమ్ము లతిరసమ్ము లావ
డమ్ము లప్పడమ్ములన్ ॥

వచ. : స్వామివారూ! తుమ్మిపూలతో సమానమగు దావళ్యము గలదియు, మృదుత్వము గలదియునగు రాజాన్నమును; కుందనముతో సమానమైన కాంతి గల సూపమును; కమ్మని యావు నేయి, పాయసము, పూర్ణపుబూరెలు, అరిసెలు, ఆవడలు, అప్పడములు మొదలగు పదార్థములతో గూడిన భోజనము లతో బ్రాహ్మణులను దృప్తుల జేయవలెనుగదయ్యా!

బ్రాహ్మ, : కం. ఓ రమణీ! వినిన యంతన
నోరూరుచు నున్నదింక నొక్కొక్కటి వే
ర్వేరుగ వక్కాణింపు మ
పారము లవి విన మనమ్ము భ్రమ గాకున్నే!

వచ. : భామా! నీవు చెప్పిన భోజన పదార్థములు వినిన మాత్రముననే నోరూరు చున్నది. వానిని వేర్వేరుగ నొక్కొక్క పదార్థమును, వాటి రుచులతో గూడ నభివర్ణింపుమా, భామామణీ!

భామ, : సీ. ఓహో! నిజము 'బ్రాహ్మణో భోజన ప్రియో'
యందు రమ్మాట మీయందె జెల్లు।
విన రుచియైన భోజన వస్తువులు కొన్ని
చెప్పెద నిక కొన్ని—చేమ, కంద

గడ్డ, పెండలము, కాకరకాయలును, పొట్ల
కాయలు, లేత వంకాయ, లరటి
కాయలు, తగు బీరకాయలు, నానప
కాయ, లింపగు బెండకాయ లాది

తే॥ గీ॥ గ, గల వంటకమ్ములు; నేతి గారెలు, బూరె
వస్తువుల్, కజ్జికాయలు వరుస తోడ,
పాయసాన్నంబు, పచ్చళ్లు, పప్పు, నేయి,
పెరుగు, మరి కూరగాయ లోగిర మొసంగి॥

వచ. : అయ్యవారూ! 'బ్రాహ్మణో భోజన ప్రియః' అను సూక్తి అర్థము మీ యందు యథార్థముగానే కన్పడుచున్నది. విన్నమాత్రముననే తృప్తి జెందెద వేని, చెప్పెదను విను మయా స్వామీ! కంద, చేమ, పెండలము, చిలకడము, అరటి, కాకర, పొట్ల, బీరకాయలు మున్నగు కూరలున్నూ; నేతి గారెలు, బూరెలు, కజ్జికాయలు మొదలగు పిండి వంటలున్నూ; చక్కెర, పాలు, పొంగలి మొదలగు చిత్రాన్నములున్నూ; ఊరుగాయ పచ్చళ్లు మున్నగు వాట్లతో నా సోమయాజి, షడ్రసాన్న

ట్లున్నాదిక మిచ్చి తృప్తి నందింప రదె
ట్లున్న పశు మేని రోమము
లన్ని సహస్రముల విప్రు లత్యంత మృ
ష్టాన్నమున తృప్తు లగుటయె.
శాంతి, అడిగిన కూడు పెట్టని వాని
కటిక సోమయాజి యనుట తప్పు
గాదు; అంతటికి నోపక మఘము తా
నంతటు జేయగ దగు నటనా ?
అతుల ద్రోచిన యూరక యుం
డుట దగదె ! ఘాత కోరిచి ॥ కటిక ॥

వచ. : స్వామీ! మీరు యజ్ఞమును జేయుదురు. కాని, తగిన శాంతి జేయకుందురుగదవయ్యా! అది ఎటువలెనంటే, యజ్ఞ పశువునకు శరీరమం దెన్ని రోమము లుండునో - అంత మంది బ్రాహ్మణులకు మృష్టాన్నము బెట్టిన శాంతి యగును. అలాగున జేయక డంబార్థముగ పశువును మాత్రము జంపి, బ్రాహ్మణులు అన్నము నడిగితే పెట్టలేనివాడు యజ్ఞము జేయదగునా? అట్లు యజ్ఞము జేసి నట్లయిన అతడు 'కటిక సోమయాజి' అనబడును. అటు లనుట తప్పు గాదు. అటుల యజ్ఞము జేయుటకు శక్తి లే నట్టయితే యూరకుండవలయును. అలా చేతగానట్లయితే యూరకుండరాదా! అట్లుగాక, యజ్ఞములు జేయుచు పశు ఘాతకు బాల్పడినారు. కనుక, మీరు ఘాతకులు కారటయ్యా, అయ్యవారూ!

బ్రాహ్మ, కందార్థము : కన్నెరో! ఎన్నడొ అటులనె
విన్నా విటు జేయ దేవవీరుల తరమే!
అన్నిటి కీశ్వర భక్తియె
మిన్నగు హరిభక్తి మరువ మిటు సేయదుమే!
మిథ్యోక్త ధర్మము లెటుల మానుదుమే
కటు మంత్ర
మధ్య నుత్కట క్రియ
మధ్య సంఘటిత విష్ణునామ
స్మరణ పటిమ కోటి గుణిత
మటు గనుక నత్యాదరములునొ
దిటముగల పటిమలగల జన్నము
లిటుల జేయుట తగదు; ఘాతకు
లంటివి ఎటులనో తటుకునను దెలుపుము ॥ఇటు॥

వచ. : భామామణీ! ఎంత గడుసరివి? అన నటులనె యుండి గొప్ప మాటనే అన్నావు. సరియే గాని, ఆ పశువునకు రోమము లెన్ని యుండునో అంతమంది బ్రాహ్మణులకు ఇష్ట మృష్టాన్నములు

పెట్టవలయు నని యంటివి. అలాగున పెట్ట జాలని యెడల యజ్ఞములను జేయకుండ నుండవలె నంటివి. నీవు చెప్పిన విధముగ జేయుటకు దేవశ్రేష్ఠులు కూడ సమర్థులు కారు. యజ్ఞములు మాన రానివి కదా ! అందుకు అన్నిటికన్న నధికమైనది భగవద్భక్తి. కనుక, అట్టి భగవద్భక్తి కలిగి, త న్నామ స్మరణ జేయుచు మేము యజ్ఞములను జేయుదుము. ఇటువలె జేయుట తప్పుగాదు. యజ్ఞములను జేయు నపుడు మంత్రమధ్య, క్రియామధ్యమ్ములందు విష్ణువును స్మరింతుము. ఆ నామ స్మరణముతో చేసిన కర్మ నొక యంశము జేసినా, అదియే కోటి యంశములై అనంత ఫలము నిచ్చును. అలా యజ్ఞములను జేయు మమ్ము ఘాతకుల మంటివి. అది ఎటువంటి ఘాతమో వివరింపుమా, భామారత్నమా !

భామ, : చం. బ్రతికిన మేకపోతులను బగ్గపు
త్రాడుల బట్టి గట్టిగా
గుతుక బిగించి, బొడ్డు దెగ గోసియు
త ద్వప దీసి, యగ్ని కా
హుతుల నొనర్చి సంతసము నొందుచు
నుందురు ఘాతుకుల్ మరో
యతిశయ మిందు మీ దయివ మంతకు
మించిన ఘాతకుం డగున్॥

వచ. : సజీవములైన మేకపోతులను పగ్గపు త్రాడులతో గట్టి, వాటి కంఠము బిగించి, చంపి, వాటి నాభి ఛేదించి, వపాదికమును అగ్నియందు వ్రేల్చి సంతసింతురు. అందుచే, మీరు ఘాతుకులు. ఇంతియగాక, నింకొక యతిశయము కలదు. అది యేమన, మీ దైవము మీ కంటెను మించిన ఘాతకుడు కాదటయ్యా, బాపనయ్యా !

బ్రాహ్మ. : అయ్యో, అయ్యో! ఎంతమా టంటివి ? అయినను,

కం. : మా కొక దైవము తక్కిన
లోకుల కొక దైవము నని రూఢిగ నీవే
కాక యితరు లెరుగరు, కద
ఏ కొలది ఘటించె ? ఘాత లెరిగింపు, చెలీ !

వచ. : ఆగి ఆగి కడ కెంతటి మాటల ననుచుంటివి! మా కొక దైవమును, తక్కిన లోకుల కొక దైవము నని నీవె చెప్పుచున్నావు. మరి యెవ్వరు నిట్లు బలికి యుండలేదు. మా దైవ మెవ్వరో, ఆయన ఎంతమా త్రము ఘాతలు చేసినాడో చెప్పుమో, తరుణీమణీ !

భామ, : ద్విప. వినుడి, తెల్పెద నేను, విశ్వంబులోన
నొనరగ 'అగ్ని ర్దేవో ద్విజాతీనా,
మని శాస్త్రముల్ చెప్పు మాటల చొప్పు
లను కృశానుడు విప్రులకు ముఖ్య మగును।
తన వేడికిని మెప్పు దగినదై యొప్పు.
తినరాదె సింగంబు, తెగ పులి గుంపు।
గాన మలినంపు కడుపెల్ల నింపు।
.........................
గజమాది గాలింపు గలిగె భాగంపు
వ్రజముపైన దలంపు వలన నీ తెంపు।
మనకెట్టు లది యింపు బలవత్కరంపు
పనుల జేతను జంపు బలు దుర్బలంపు।
ఘాతకా కిది తెంపు గలదె ? తలంప
భూతాళిని వధించు బుద్ధి నూహింపు।

వచ. : అయ్యవారూ! "మీ కొక దేవుడు, మా కొక దేవుడు నేమి ?" అన్నారు. అందుకు మనవి జేయుచున్నాను, చిత్తగింపుడు. ఈ లోకములో "అగ్ని ర్దేవో ద్విజాతీనాం।" అని శాస్త్రములు చెప్పుచున్నవి, కాదంటయ్యా! కనుక, మీ ద్విజులకు అగ్నిహోత్రుడే

దైవము. ఆ అగ్నిహోత్రుడు, తన వేడిమికి దగినట్లు సర్వప్రాణి భయంకరమైన మృగరాజగు సింహమును తిన దగును కదా! అట్లుగాక పోయినచో, చిన్న మృగములకు రాజగు పెద్దపులిని కోరిన వాడా? కాదు. 'సర్వం హస్తి పదే మగ్నం' అన్నారు. కనుక, సకల జంతు సముదాయములో పెద్ద శరీరముకల ఏనుగును తినినచో కడుపు నిండును కదా! అటుల కోరినవాడా? కాదు. ఇట్టి బల పరాక్రమ యుక్తము లయిన జంతువులను గోరక, అల్పములైన మేకపోతులను గోరెను. ఆలాటి మేకపోతులనైనా బలాత్కారముగ జంపించు చున్నాడు. కనుక, మీ దేవుడు ఘాతకుడు కాడా! సర్వ జీవులయందు సమభావము కలవాడవై ఆలోచింపుము. మహానుభావా! మీకంటే బోయలు సర్వోత్తము లయా! అది ఏలాగునంటే వినుమయా, వివరింతును.

కం. బ్రతికిన మేకల బట్టుక,
కుతుకలు బిగియించి చంప గూడ దటంచున్।
అతి భయపడుదురు, బోయలు;
మతిఁదలపుము; వారె గొప్పమాన్యులు జగతిన్॥

ఉ. కాండము విల్లునున్ గొనుచు
కారు మృగంబుల జంప నేర్పు లే
కుండగ నిల్చి పల్వురల, కొండొక
మేకను జంపి మాంస మా
కుండము లోన నంటుటకు
గూడని వేల్పుల కిత్తు రింతె – భూ
మండలి జెల్లున్? తనకు మాలిన
ధర్మము సోమయాజికిన్॥

వచ. : స్వామివారూ! బోయలకు 'అల్పప్రాణులగు మేకలను జంపరాదు' అను పాపబితి యున్నది. అదియునుగాక, మీరు ధనుర్బాణములను ధరించి అడవి యందలి క్రూరమృగంబు

లను జంపలేక, అల్ప జంతువులగు మేకపోతులను బలువురు గలసి బలవంతముగా జంపి, దాని అమిషమును మీరైనను అనుభవింపక, అంతరాని వేలుపగు అగ్నిహోత్రునకు ఇచ్చెదరు. ఇది తనకు మాలిన ధర్మము కాదటయ్యా, స్వామీ!

దరువు - ఆది తాళము

1. తనకు మాలిన ధర్మ మిదేల ? మేల ?
   మును తాను దనిసి, అన్యునికి బెట్టును గాని ॥ తన ॥
   మీ రానతిచ్చినారు గాదయ్యా!
   "శరీర మాద్యం" అను దాని చెప్పి।
   ఇది తప్పి ॥ తన ॥

వచ. : తనకు మాలిన ధర్మము జేయవచ్చునటయ్యా, స్వామీ! 'స్వయం తీర్ణః పరాన్తార యతి' అను రీతిని తాను తృప్తినొందిన వెనుక, ఇతరులను తృప్తి నొందింప నగును. అదిన్ని గాక, "శరీర మాద్యం ఖలు ధర్మ సాధనం" అని చెప్పి ఆ యర్థమును మాని ఇటు చేయవచ్చునటయ్యా, స్వామీ!

2. అనయ! 'పరోపకారార్థ మిదం శరీర,'
   మ్మను మాటలు జెప్పి, ఇంతకు నొప్పి ॥ తన ॥

వచ. : 'పరోపకారార్థ మిదం శరీర' మ్మను వచనమునకు సమాహితులై లోకుల కా వాక్యమును ప్రబోధించు మీరు పర హింసకు బాల్పడ దగునటయ్యా, స్వామివారూ!

3. ఘోరమైనట్టి క్రూరకర్మచే గొప్ప
   వారమైతి మని గర్వారంభమును, బూని ॥ తన॥

వచ. : ఘోరమైన ఈ కఠిన కర్మ జేసి దండి వార మైతి మను గర్వాతిశయముజేత మీ రిటుల జేయదగునటయ్యా!

4. కామ మడంచి క్రోధ లోభము లడించి।
   దీమసమున పరంధాముని జేరరాని ॥ తన ॥

వచ. : 'కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యము' లనే అరిషడ్వర్గములను జయించి, ఆ పరమాత్ముని పొందలేని ఈ కర్మల వలన ప్రయోజన మేమున్నదో, చెప్పుమయా!

౫. నాకము కేగి మరల కా యోగుని
శ్రీ కూచిపూడి శశిశేఖరుని జేరరాని ॥ తన ॥

వచ. : ఈ యజ్ఞములను జేసినందు వలన స్వర్గభోగము లనుభవించితే, "తం భుక్త్వా స్వర్గలోకం విశాలం, క్షీణే పుణ్యం మర్త్య లోకం విశన్తి" అను గీతా వాక్యము ననుసరించి, స్వర్గభోగము లనుభవించుచు కొంతకాల మచట నుండి, క్షీణ పుణ్యులై తిరిగి మర్త్య లోకమునందు జన్మింతురు కాని, పరమపదమును జేర దగుదురయ్యా!

తే. గీ. అటుల గాకున్న మీరు వేటాడరాదె!
ఆత్మయను ఘోర కాననమందు నున్న
శత్రు షడ్వర్గ శార్దూల శరభ తతుల
గెలువగా రాదె! పటుశక్తి కలిగియున్న॥

వచ. : అయ్యవారూ! బాహ్యవనమందు గల సింహ శార్దూలాది మృగములను వేటాడి చంపు నేర్పు లేదంటిరేని, 'ఆత్మ' అను అరణ్యమున మదించి విచ్చలవిడిగా దిరుగాడు అరిషడ్వర్గములను జయించరాదంటయ్యా, బాపనయ్యా!

తే. గీ. అనఘ! విను జ్ఞాన కర్మేంద్రియములు పదియు,
వాని విషయములు నొక పది, వాయు పంచ
కము, మనోబుద్ధి, చిత్తాహంకారములును,
మిన్నగా నింద్రియము లెల్ల మృగము లరయ॥

వచ. : అయ్యవారూ! జ్ఞానేంద్రియ, కర్మేంద్రియములు పది. అవి యేవి యంటే, త్వక్కు, చక్షు, శ్రోత్ర, జిహ్వా, ఘ్రాణములు—ఈ అయిదున్నూ జ్ఞానేంద్రియములు. వాక్కు, పాణి, పాద, పాయు, ఉపస్థలు—ఈ అయిదున్నూ కర్మేంద్రియములు. వీటికి

విషయంబులు పది గలవు. అవి యేవి యంటే—శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు అయిదున్నూ జ్ఞానేంద్రియ విషయములు. 'వచన, దాన, గమన, విసర్జన, ఆనందములు' అను అయిదున్నూ కర్మేంద్రియ విషయములు. అయిదు వాయువులు గలవు. అవి యేవి యంటే—ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానములు. ఇంకనూ మనస్సు, బుద్ధి, చిత్త, అహంకారములు నాలుగు కలసి మొత్తము ఇరువది తొమ్మిది ఇంద్రియ సముదాయము లగును. ఈ మృగములు 'తలపు' అను అడవిలో మదించి తిరుగాడు చుండును. ఇలా తిరుగుచుండు నింద్రియ మృగములకు నొక యాశ గనబరచి, సంచారము మాని నిలచు నటుల జేయవలయును. అది ఎటువలె నంటే, వాటికి గంట చప్పుడు విన నాశ గొలిపి నిలుప వలయును.

బ్రాహ్మ, వచ. : బాగు—బాగు లెస్సగా బలికితివి. అచట గంట యేది? దాని నాద మెటువంటిదో వివరింపుమా, భామా!

భామ, వచ. : అయ్యవారూ! 'కనుబొమ'లను విండ్లకు చూపులను తూపులను దొడగి ఆలన్యము జేయక నట్టనడి స్థానము నందు వేయ వలయును.

బ్రాహ్మ, వచ. : నట్టనడిస్థాన మెచట నుండునో చెప్పుమా, భామామణీ!

భామ, : తే. గీ. కుడిని 'ఇడ,' యుండు ; 'పింగళ' ఎడమవైపు
నుండు;— నీ రెంటి మధ్యగా నుండు సూక్ష్మ
మై వెలుంగు 'సుషుమ్న' నామమ్ము నొంది,
అదియె 'బ్రహ్మనాడి' అనుచు నంద్రు బుధులు ॥

వచ.: కుడివైపున 'ఇడా'నాడి యుండును. ఎడమవైపున 'పింగళా' నాడి యుండును. ఈ రెండు నాడులకు మధ్య 'సుషుమ్న' అను నొక సూక్ష్మనాడి యుండును. దానిని పెద్దలు 'బ్రహ్మనాడి' అందురయ్యా, స్వామీ!

కం. : ఆ నాడి కగ్రమందున
గానంబడు సుషిర మొకటి కడు సన్నం బా
లోన రవి, శశియు, దిశలు, గ్ర
హానుం దీశ్వరుడు భూత సమితియు శ్రుతులున్ ॥

కం. : వన నిధులు, పర్వతంబులు
మనుజులు, దనుజులును, సరలు మంత్రంబులునున్
వన లోక నదీ ద్వీపము
లును గల బ్రహ్మాండ మంత రూఢిగ నుండున్ ॥

వచ.: అయ్యవారూ! ఆ నాడికి తుది యందు నొక సూక్ష్మనాడి గలదు. దానిని 'బ్రహ్మబిలము' అందురు. అదియే మోక్ష ద్వారము. అచట చంద్ర, సూర్య, అగ్ని, దిక్పరమేశ్వర, భూతగణములును; సముద్ర, పర్వత, దేవ, దానవ, మనుష్యులును నద నదీ ద్వీపములు; వేద శాస్త్ర మంత్రములతో గూడిన బ్రహ్మాండ మంతయు నుండును గాదంటయ్యా, స్వామీ !

కం. : వరపుగ న న్నాడిని దగ
గురి జేయ ననాహతమున గురు శరంబుల్,
బోరి బోరి యనంగ నం దు
ద్ధుర నాదము పుట్టు నమృత తుల్యం బగుచున్ ॥

వచ. : ఇటువంటి సూక్ష్మనాడిని గురిచేసి చూపు లను బాణములు అనాహతము నందు బరుపబడ వలెను. ఇందువలన నచట నెడతెగని నాదము పుట్టును.

బ్రాహ్మ, వచ. : ఆ నాద మెటు లుండునో విశదము జేయుమా భామా!

భామ, : ఉ. నాదము తైల ధారవలె నద్భుతమై
యెడతెంపు లేక స
మ్మోదముతోడ గంటవలె మోయు
న దిట్టి దటంచు జెప్పగా

రాదు; సమీ! అవాచ్య మతి రమ్యము
దాని నెరుంగ వారె బో
వేద విదుల్, మహాత్ము లన విందుము
పెద్దలచేత నెప్పుడున్॥

వచ. : ఆ నాద బ్రహ్మ మెటువలె నుండునంటే, తైలధారవలె తెంపు లేక, 'ఓ మ్ మ్ మ్' అని పెద్ద గంటవలె నెడలేక మ్రోయు చుండును. ఆ నాద మిటువంటిదని చెప్పుటకు వలను పడనిది. అది దశవిధ ప్రణవ నాదములలో శ్రేష్ఠమైనది. అట్టినాద బ్రహ్మము నెరిగిన వారే వేదవిదులు కాదటయ్యా!

తే. గీ. : ఆ ప్రణవ రవమును శ్రద్ధ నాలకించి,
ఇంద్రియమ్ముల తిరుగుడు వింతలేక
జ్యోతి యుదయించి వెలుగొందు శోభతోడ,
మనసు నంతటు వ్యాపించు ననగ వినవె?॥

వచ. : ఆ ప్రణవ నాదమును వినుచు 'నింద్రియము'లను మృగములు తమ తమ వ్యాపారములను మరచి నిలచి యుండును. ఆ సమయమున నొక జ్యోతి కన్పించును. అది మనస్సునం దంతటు వ్యాపించియుండునని వినియుండలేదటయ్యా, స్వామీ! ఆ మన స్సెటువలె నుండు నంటే,

ద్విప. : తలపగా మనసు మత్త ద్విపేంద్రంబు
వలె దాను విషయ సంవర్తిని గాన।
దాని బంధింపగా దక్కిన ప్రణవ
గానంబు విననీదు గాన బంధించు,
సాధన మెట్లన్న సద్గురు డిచ్చు,
బోధాంకుశముతోడ బొడుచుచు నెమ్మి।

వచ. : ఆ మనస్సు మదించిన యేనుగువలె సకలేంద్రియ విషయములందు సంచరించు చుండును. దానిని ముందుగ బంధించ

వలయును. అట్లు జేయకుంటిమా, నాద బ్రహ్మమును ప్రసరింప నీయదు. కాన, మనోద్విపమును బంధింపవలయునుగదా,స్వామీ!

బ్రాహ్మ. : భామామణీ! ఆ గజమును బంధించు నుపాయము నెరిగింపుమా!

భామ. : అయ్యవారూ! 'ధారణాయోగ'మను త్రాటితో, 'సద్గుర బోధన' మను నంకుశముతో మస్తకముపై బొడుచుచు, 'నిశ్చల జ్ఞాన' మను స్తంభము కడకు గొనిపోయి బంధించ వలయును. ఇటుల గట్టివైచిన తరువాత అమనస్కుండై 'పరబ్రహ్మతత్త్వ' మను నమృతమును, అనగా తత్సుధామిషమును, అనుభవింపక ఇట్టి హింసాకరమైన పనులను జేయవచ్చునటయ్యా, స్వామీ!

దరువు - నాట రాగము ఆది తాళము

చక్కగ నాలింపు డీ! కల కొలది తెల్పెదను ॥చక్క॥
ఉక్కు మిగుల విర్రెక్కిడి మృగముల
నుక్కడించి చక్కడంచు తెరగిదె ॥చక్క॥

1. నిలుపరాకా, మదినీ బట్టెటి సంకల్ప
వికల్పపు టుడవినీ బోల్పరాని బల్ క్రో
ల్పుల సమా కర్మేంద్రియ
ముల వల్ల దగు తెరవూ ॥చక్క॥

2. 'కనుబొమ' లను విండ్లను పొందించి, 'చూపు'
లను శరముల చేతను, కినిసి కుడి యెడమ,
లను జొన్నగ గురి గొనుచు, నట్టనడుమను
నేయ వలయు ॥చక్క॥

3. మతి యచ్చుట రహింపగ చూపమ్ము లనా
హతమందు నుంచగ, నతులిత ఘంటా గతి దనర్చి, య
ప్రతిభ నాదము తతి జనించు నిదె ॥చక్క॥

4. అచలమగు నాదము నాలించి అందు,
దోచ దిం దియ జాలము జూచి నపుడు ని
ర్వాచకుడగు శ్రీ కూచిపూడి పరమేశుని తత్త్వము ॥చక్క॥

వచ. : అయ్యవారూ ! ఇదివరకే మనవి జేసి యున్నాను. ఏమనియంటే, ఈశ్వరుడు ఇట్టి కర్మలచేత చిక్కడు అని, ఎన్ని విధములనైన ఆ భగవంతుని జిక్కించు కొనుటకు అనవద్య భక్తియే మార్గము అని, కాని తదితర కర్మలచేత చిక్కడయా స్వామీ ! అని.

దరువు - అటతాళము

చిక్కనేరదయ్యా ! బ్రహ్మము-గురుబోధలేక ॥ చి ॥
చిక్కనేరదయ్యా ! పరబ్రహ్మము - లెక్కకు మిక్కిలి యగునా ?
రొక్క మెంత దాన మిచ్చిన, నొక్క నాడైనగాని ॥ చిక్క ॥

1. నూరు యజ్ఞములను జేసేనా,
గంగా యమునాది ।
యేరు లందు మునిగి యలసినా,
ధీరుడై గయా ప్రయాగ ।
వారణాసి మొదలు దివ్య
దూర యాత్రలు ఎల్ల జేసినా ।
గురుని జేరక యున్న, చిక్కనేరదయ్యా !
పరబ్రహ్మము గురుబోధలేక ॥ చిక్క ॥

2. వేదమంత్రములు పఠించినా,
శాస్త్రములు చదవి ।
వాదము లాడి గెల్చినా,
మోదముతో నేల నొక్క ।
పాద మూని చేతు లెత్తి
మీదికి నెత్తి తపము జేసినా ।
బోధ లేకున్న నీకు చిక్కనేరదయ్యా !
పరబ్రహ్మము గురుబోధలేక ॥ చిక్క ॥

3. ముక్కు జెవులను బిగియ మూసినా,
యూపిరి లోన జిక్కబట్టి

నిక్కి జూచిన డొక్క లుబ్బునుగా కవేల
నిక్కము నా కూచిపూడి చక్కని వేల్పు ।
నిజతత్త్వము దిక్కు నొందకను ॥ చిక్క ॥

వచ. : పరబ్రహ్మమును స్వాధీనము జేసికొనుటకు అపరిమిత ద్రవ్యమును దాన మిచ్చినను; శతక్రతువులు జేసినను; గంగా, యమునా, సరస్వతి మున్నగు పుణ్యనదులలో స్నానము జేసినను; కాశీ, గయా, ప్రయాగాది పుణ్యక్షేత్రములను దర్శించి నను; నాల్గు వేదములు పారాయణము జేసినను; తర్కణవ్యాకర మీమాంసాది షట్ఛాస్త్రములు చదివి వాదనచే నితర పండితులను జయించినను; ఒక్క పాదముపై నిలబడి ఊర్ధ్వ బాహుడై తపస్సు జేసినను; తర్క, వ్యాకరణ, మీమాంసాది షట్ఛాస్త్రములు చదివి వాదనచే నితర పండితులను జయించినను; ఒక్క పాదముపై నిలబడి ఊర్ధ్వ బాహుడై తపస్సు జేసినను; కర్ణ, నాసా పుటములు బిగియించి షణ్ముఖి మున్నగు ముద్రలు అభ్యసించినను; ధారణ యోగియై కడుపుబ్బగా వాయు నిరోధము జేసినను; సద్గురు బోధ నంది, ఆ ఈశ్వరుని యందు నిశ్చలభక్తి లేక ఆ పరబ్రహ్మ వస్తువు చిక్కదయా, స్వామీ ! బ్రహ్మస్వరూపము నెరిగిన బ్రాహ్మణులైతే బ్రహ్మజ్ఞానమును దెలుపుడయా !

దరువు-నాదనామక్రియ-ఆది తాళము

1\. బ్రహ్మ మేదో తెల్పుమయా, ఓ బాపనయ్యా ॥ బ్రహ్మ ॥
నిర్మలత్వమైనట్టి కర్మతెరగైనట్టి ॥ బ్రహ్మ ॥
అరణి బట్టి మథించుటో
మథియించి యందు ।
బరగు వహ్నిని గాంచుటో
చంచలములైన ।
ఇరువై యైదింద్రియముల
మరలు పరాక, గనరాని ॥ బ్రహ్మ ॥

2. పశువుల నంట గట్టుచో
బంధించి వాని,
పిశిత మగ్నిలో వ్రేల్చుటో
మేను సద్గురుని ।
వశము జేసి తద్బోధ వినుటో
పసలే రెరుంగ రాని ॥బ్రహ్మ॥

3. పాత్రల నాసాదించుటో
ఆసాదించుచో ।
సూత్రములు వచియించుటో
తనలోని దుష్ట ।
శత్రుల బట్టి మొత్తక ఎరుంగ రాశిం ॥ బ్రహ్మ ॥

4. వేదికల్ సంఘటించుటో
ఘటియించి సమిధ ।
లాదిగ సంతరించుటో
శ్రీ కూచిపూడి కాపగు
వేల్పుని రూపమైనట్టి పర ॥బ్రహ్మ॥

వచ. : పరబ్రహ్మమును దెలియుట యనగా, అరణి చిత్రకోల బట్టి మథించి యగ్నిని జట్టించుటయున్నూ, పశువును బందించి దాని యామిషమును అగ్నియందు హోమము జేయుటయున్నూ, ఆ యగ్ని చుట్టూ పాత్రల నాసాదించుటయున్నూ, వాని సూత్ర భట్టీయ వాక్యముల నుచ్చరించుటయున్నూ, శాస్త్ర ప్రకారముగా నంతర్వేది మొదలుగాగల వేదికల నేర్పరుచుటయున్నూ, సమిత్తులు మొద లయిన హోమద్రవ్యములను సమీపమునం దుంచుకొనుట యున్నూ, యూప స్తంభమును దెప్పించి దానిని స్థాపనము జేయించుటయున్నూ- ఈ మొద లయిన పనులు జేయుటయును గాదయా, స్వామివారూ! ఇక నెటు వలెనంటే, సర్వేంద్రియములను విషయముల వెంట బోనీయక నిగ్రహింప వలెను. తన శరీరమును

సద్గురు వశముజేసి, ఆయన బోధనలను శ్రద్ధగనాలకించి, ఆచరణము నం దుంచవలెను. సాధనా చతుష్టయ సంపత్తిని పొందకుండుటయును, తనలో నున్న అరిషడ్వర్గములను జయించుటయును, అగ్ని మధించుట మున్నగు యజ్ఞశాల ధనములగు నీ కర్మలచే దెలియ రాని పరబ్రహ్మమును దెలియవచ్చునటయ్యా, బాపనయ్యా! అందుకు నేమి జేయవలెనంటే,

ఉ॥ రూఢీగ కర్మ జూడ నవిరోధియు
గాదు; సుమీ! అవిద్యకున్,
దోడగు దర్శిరాత్రి గుడు తోయద
పంక్తులు బన్ని యెల్లడన్
గాఢ తమంబు జేయు క్రియ గప్పు
నవిద్యకు వైరి విద్యతో
నోడక నంధ తామసము నొందు
రవిప్రభ వోలె నచ్చుటన్ ॥

వచ. : ఓ పుడమివేలుపా! ఎడలేని కామ్యకర్మ అజ్ఞానము నకు విరోధి కాదు. కాబట్టి అజ్ఞానమును గొట్టివేయలేకపోగా సహాయక మగును. అది యెలాగుననంటే, అమావాస్య నాటి రాత్రియందుండు రాత్రికి మేఘములు గాఢముగ నల్లుకొని చీకటిని వృద్ధి జేయు నటుల కర్మ అజ్ఞానమునకు సహాయమై వృద్ధి జేయును గాని, కొట్టివేయలేదు. జ్ఞాన మజ్ఞానమునకు విరోధి. కాన గాఢ తమమును సూర్య ప్రభ కొట్టివైచు నటుల నది యజ్ఞానమును దొలగించును. కాన, కర్మకంటె జ్ఞానము అధికము కాదంటయ్యా, స్వామీ!

బ్రాహ్మ. తే. గీ. రూఢి కర్మ అవిద్య విరోధి గాదు,
తాను దోడ్పడు రాత్రుల దర్శియందు
మబ్బు లల్లిన ట్లంటివి. జ్ఞాన హేతు
వందు రది యెట్టులో నాతి! వింద జెపుమ!

వచ. : నీరజాక్షీ! నిశ్చయముగా ఆ కర్మ, అజ్ఞానమునకు విరోధి కాదంటివి. 'జ్ఞానస్య కారణం కర్మ' అని విజ్ఞులు చెప్పుచున్నారు. అది యెటులనో చెప్పుమా, భామారత్నమా!

భామ, : ద్విప. విను, మీశ్వరార్పణ విధి జేయు కర్మ
ఘన చిత్తశుద్ధి దా గనుపించుఁ దాన,
నందు సాధన చతుష్టయ సంపదయును,
నందుచే సద్గురు నాశ్రయించుటయు
బోధ నందుటయును పొంది నరుండు
బోధచే జ్ఞాన సంపూర్ణుడౌ గాన,
అరయ జ్ఞానంబు ప్రత్యక్ష సాధనము
సర ఁపరంపరా సాధనం బనుచు,
పలికిరి యాకటు బడియున్న వారి
కెలమి ప్రత్యక్షాన్న మింపుగా నిడిన,
సిద్ధాన్న కబళమౌ చిత్తంబు నలరు
శ్రద్ధగా సేద్యంబు నల్పి పండించి,
పెట్టెద నన్నచో పేదల కెట్లు
పొట్టలు నిండు? తృప్తులు వౌదు రెలమి,
దాని సమంబేది, తలపోయ భువిని?
మానితంబుగ జెప్పుమా! భావనయ్యా!

వచ. : ఓ భావనయ్యా! తమరు 'జ్ఞానస్య కారణం కర్మ' అని, దానినే దివ్యార్థ మంటిరి. అట్లు కాద్యయ్యా, స్వామీ! ఈశ్వరార్పణ బుద్ధితో జేసిన కర్మచే చిత్తశుద్ధి యగును. దానివలన సద్గురు ప్రాప్తియు, నా గురు లాభమున సద్బోధయు, త ద్బోధమున జ్ఞానము కలుగుమ. జ్ఞానమునకు పరంపరా సాధన మగును కాని సాక్షాత్సాధనము కాదు. కనుక, నిష్కామ కర్మ జ్ఞాన సాధన మని పెద్దలు ప్రవచించిరి. కాని, ప్రత్యక్ష సాధనముగా జెప్పరైరి. క్షుధాతురుడైన వానికి ప్రత్యక్షాన్నము తృప్తి నిచ్చును గాని భూమిని మడికట్టి దున్ని, పండించి ఆ ధాన్యమును దంచి,

ఆ బియ్యమును వండి, ఆ అన్నమును బెట్టెదము అనిన ఆకలి దీరునా ? మోక్షాపేక్ష కలవారికి జ్ఞానమే సద్యస్సాధనము కాని పరంపరాసాధన గాని, నిష్కామకర్మ గాని, సకామకర్మ గాని కాదయా, స్వామీ !

ఆ. వె. : బాహ్య కర్మలెల్ల బాటించి తా కర్మ
సోమయాజి యయ్యె సుమ్ము ; దాన
నాత్మ యజ్ఞ సంభృతానందు డగు బ్రహ్మ
సోమయాజి కున్న సుఖము కలదె ?

వచ. : అయ్యవారూ ! బాహ్య యజ్ఞ కర్మల నాచరించి కర్మ సోమయాజు లయినారు. కాని, ఆత్మయజ్ఞమును జేసి బ్రహ్మ సోమయాజు లయిన వారి యానందముతో సమానమైన యానందము వారికి లభించదు గాదంటయ్యా, స్వామీ !

బ్రాహ్మ, : ఆ. వె. 'ఆత్మయజ్ఞ' మనుచు నాడెద వచ్చోట
నగ్ని. పశువు, సమిధ లాజ్య మంత్ర
సలిల యూప ఋత్విజాధ్వర్యులను, దగిన
వానినెల్ల పొల్పుతోన జెపుమ !

వచ. : జగన్మోహినీ ! నీ పలుకులు పంచదార చిలుకలవలె మిక్కిలి మోదము కలిగించు చున్నవి. ఇపుడు నీవు 'ఆత్మయజ్ఞము' అను దానిని ప్రతిపాదించితివి. ఆ యజ్ఞమునకు వలయు నగ్ని, పశువు, ఘృతము, సమిధలు, మంత్ర, యూపాదులను వరుసగా నెరిగింపుమా ఇగురుబోడీ !

భామ, : సీ. ఘన చిత్త బుద్ధ్యహంకార త్రితయంబు
నూహించి ఋత్త్విజులునుగ జేసి
ప్రణవాక్షరంబు యూపంబుగా సవరించి
జ్ఞాన కర్మేంద్రియ ప్రాణ పంచ

కము నెల్ల, పశుపిండుగను దలచి యనాహ
తాబ్జ నాదమును మంత్రము నొనర్చి
శాంతి, దాంతి, తితీక్ష, క్షమ, సమ పాత్రల
నుగ జేసి గురుబోధను, హుతవాహు

తే. గీ. : గాగ కుదురు పరచి పరగంగ జేసి
పరగ 'స్వాత్రాత్మ, శద్ధ'యన్ బత్నితోడ
రహిని జ్ఞాన సుధా సోమ రసము ద్రావి
నదురు మూ డొక్కడగు చోట నవభృథమ్ము
నేమరక జేయుగా నాత్మ సోమయాజి॥.

దరువు–సావేరి రాగము–మిశ్రచాపు తాళము

1. బాగుగ మానస యాగము జేతు
రమోఘ విజ్ఞాను లెల్ల రందువల్ల।
వేగ మమత్వాను రాగము లుడిగి, భవ
భోగ సంజాత దుర్భావము వీడి, రాజ।
యోగమం దనురాగులై నిజ
యోగ మయా నరాగ మెరిగి వి।
రాగులై, ముక్తి కాంతా సం
యోగులై భోగించి వేడ్కను, ॥ బాగు ॥

2. మేలౌ త్రికూట విశాలస్థలి యజ్ఞ
శాలగ నమరించియు
నాలో వివేకము నధ్వర్యుగా చిత్రి
కోల నరణి మనో గురువాక్యములు జేసి।
చాలగ విజ్ఞాన వహ్ని జ్వాలలం దాగామి
నంచిత పాత్రిరబ్ధమను హుత పదార్థము।
లోలి చక్కగ శేర్చి, సుఖులై ॥ బాగు ॥

. అత్తరి నిజబుద్ధి చిత్తాహంకృతులు
ఋత్విజులు గావించి।

ఉత్తమాంతరమును యూపముగా నిల్పి।
మత్తేంద్రియ పశు।
మొత్తములను 'దృఢభక్తి' యనియెడి
కత్తి తోడుతమొత్తి, మాయా
వృత్తియన్ వప నత్తుగ దశనాద శ్రుతి
మంత్రోక్తముగ తప్త మొనరించుచు ॥ బాగు ॥

4. శమ, దమముల రెంటిని నమరగ స్రుక్కు
స్రువములుగ నాచరించి, సర్వ
సమభావ, సత్య, శౌచముల నెల్లను, శ్రౌత
సముదాయములుగాగ నల్పి, యజ్ఞా
నమును సమిధలు గావించి కా
మాజ్యమును గూరిచి, 'సోహ,' మనె
హోమ మొనర్చి, సతత సా
యుజ్యము పురోడాశము భుజించుచు ॥ బాగు ॥

5. నానానంద నిర్వాణానూన వి
జ్ఞానామృతము సదా సోమ।
పానా నందముతో నా వ్రతము 'త్రి
వేణి సంగమములో నవబృథ।
స్నానమును గావించి, ఇట్టుల అ
నూన శాంత్యాది భూషణాంగ।
స్థాను లేపన మాల్య వసనము లూని
యప్రతిమానులై ఇటు ॥ బాగు ॥

6. ప్రేమ శ్రీ కూచిపూడి నామ పురవర
ధాముని సత్కృప శ్రీ
రామలింగ గురుస్వామి, మానస యాగ
మేమరక జేసి భూమిలోన బ్రహ్మ
సోమయాజి యనంగ దనరిన
యా మహాత్ముని సాటి రారొక

వ్యోమకేశులు దక్క నితరులు
రామ గానె భూమి నొక కొందరు ॥ బాగు ॥

వచ : ఓ విప్రవర్యా ! ఆత్మ యజ్ఞము జేయువారు, త్వరితముగ మమ తానురాగములను త్యజించి, అభిలాషల నుజ్జగించి, జన్మ సంబంధములగు దుర్విషయంబుల నుజ్జగించి, రాజయోగంబు నం దాసక్తి కలిగి, యోగమాయా చేష్టల నెరింగి, సంసారాదికము నందు విరాగము గలిగి, ముక్తికాంతాభోగము నందు సంతోషము కలిగి మానస యాగమును జేయుదురయా, అయ్యవారూ !

బ్రాహ్మ. : అది యెలాగునో వివరింపుమా, భామామణీ !

భామ. ॥ అలాగుననే వివరింతును వినుమయ్యా, స్వామీ ! చిత్త, బుద్ధి, అహంకారములను మూడింటిని, ఋత్విజులగానున్నూ, ఉత్తమాక్షరమగు నోంకారమును, యూప స్తంభముగానున్నూ, జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ, పంచప్రాణములను పశువులగానున్నూ, అనాహతమునం దుండు దశవిధ ప్రణవ రవములను, మంత్రములు గానూ, జ్ఞానమును సోమరసముగానున్నూ, త్రికూట భ్రూమధ్యస్థానమును యజ్ఞశాలగా నున్నూ, వివేకమును అధ్వర్యునిగానున్నూ, మనస్సును అరణిగానున్నూ, గురువాక్యమును చిత్రకోలగానున్నూ, ఆగామి సంచిత ప్రారబ్ధములను హోమద్రవ్యముగానున్నూ, నిశ్చల భక్తిని కత్తిగానున్నూ, శమ, దమములను స్రుక్కు స్రువములుగానున్నూ, సమచిత్త, సత్య శౌచాదులను శ్రౌతులుగానున్నూ, గంగా యమునా, సరస్వతుల సంగమ స్థానమునందు అవభృథ స్నానమునున్నూ, శ్రద్ధ నాతని పత్నిగానున్నూ జేసికొని, యా క్షేత్రజ్ఞుని, ఈ చెప్ప బడిన యజ్ఞ సంబారములతో నంతర్యాగము ఆత్మ యజ్ఞము, జేసి, జ్ఞానము అను సోమపానము జేసి, సాయుజ్య మను పురోడాశమును భుజించి, పరమార్థకుండును, సూనృతాత్ముడై, శ్రద్ధా పత్నీ సమేతుడై, త్రివేణీ సంగమ స్థానమున నవభృథస్నాన మాచరించి శాంతి,

అమానిత్వాదివస్త్ర, గంధ, మాల్యాద్యలంకారములు ధరించి బ్రహ్మ సోమయాజియై వెలుగొందును గాదటయ్యా, స్వామీ!

బ్రహ్మ. : అటులయిన నీ ఆత్మయజ్ఞమును ఈ భూలోకము నందెవ్వ రైనా యాచరించి నారటమ్మా, భామామణీ!

భామ. : వ : చేయకమయ్యా, స్వామీ! ఈ భూమిలో కృష్ణా మండలమున శ్రీ కూచిపూడి అగ్రహార నివాసులున్నూ మా గురు వర్యులున్నూ పూర్వాశ్రమమున భాగవతుల వంశపయః పారావారరాకానిశాకరు లున్నూ, వాధూలసగోత్ర సముద్భవు లున్నూ, రామలింగమను నామ విరాజితులున్నూ అగువారు చేసి యున్నారు, స్వామీ! మీరున్నూ అహంకారమును పరిత్యజించి అవిధముగా జేయగాదటయా, స్వామీ!

బ్రహ్మ.: అలాగుననే భామా!

స్వస్తి సమస్త సన్మంగళాని భవన్తు

గద్య. : ఇయ్యది వాధూలస గోత్ర సంజనిత, బ్రహ్మీభూత, భాగవతుల వంశపయః పారావారరాకసుధాకర శ్రీ రామలింగేశ్వర పూర్వాశ్రమ నామ విరాజిత. యోగవిద్యా ధురంధర పుత్ర శ్రీ రామయనామ యోగవిద్యా విశారద విరచిత పిండోత్పత్తి-ఆత్మయజ్ఞనామక కలాపదృశ్య ప్రబంధమున సర్వము సమాప్తము.

సమాప్తము